ORISSA
The soul of India

మీకు ఒక క్విజ్
# సుందరనగరం భువనేశ్వర్

December
1-5, 2001
Konark Festival

దాదాపు ఐదువందల అందమైన దేవాలయాలతో వెలుగొంతుతూ, భారతదేశ దేవాలయాల నగరంగా ప్రసిద్ధిగాంచిన భువనేశ్వర్‌కు వచ్చే పర్యాటకులకు స్వాగతం! సుస్వాగతం!!

మొదట బిందుసాగర్ తటాకంలో స్నానంచేసి, భువనేశ్వర్‌యాత్ర ప్రారంభించాలని చెబుతారు. బిందు సాగర్ తటాకం గురించి ఒక ఆసక్తికరమైన కథ ఉంది. ఒకానొకప్పుడు పార్వతీదేవి అరణ్యాలలో తిరిగి తిరిగి తీరని దాహానికి లోనయిందట. ఆమె దాహం తీర్చడానికి పరమ శివుడు ఒక తటాకం సృష్టించి, భారతదేశంలోని సర్వ నదీనదాలు, తటాకాలనుంచి తెచ్చిన నీటిబిందువులతో దానిని నింపాడట. అదే బిందుసాగర్ తటాకం!

నగరంలోని దేవాలయాలన్నిటిలోకీ చాలా పెద్దది లింగరాజ దేవాలయం. ఈ శివాలయం 11వ శతాబ్దంలో నిర్మించబడింది. 46 మీటర్ల ఎత్తయిన గోపురం గల ఈ దేవాలయాన్ని ఒరిస్సా దేవాలయ నిర్మాణ శిల్పకళాపద్ధతికి చక్కని ఉదాహరణగా చెబుతారు.

ఇసుకరాయితో నిర్మించబడిన ముక్తేశ్వరదేవాలయం చాలా సుందరమైనది. ఇక్కడ తోరణంలావున్న సింహ ద్వారం; సునిశితమైన చేతిపనులతో నిండిన అందమైన శిల్పాలు చూపరులను ఎంతగానో ఆకర్షించి, ఆకట్టుకుంటాయి.

లింగరాజ ఆలయానికి కొన్ని కి.మీ. దూరంలో ఆగ్నేయదిశలో శిశుపాల్‌ఘడ్ అనే 'కోటనగరం' ఉంది. దీని ప్రాచీనత క్రీ.పూ. 3వ శతాబ్దం వరకు వెళుతుంది.

నగరానికి ఎనిమిది కి.మీ. దక్షిణంగా ధౌళీ ఉంది. ఇక్కడే అశోకచక్రవర్తి బౌద్ధమతాన్ని స్వీకరించాడు. అశోకచక్రవర్తి చెక్కించిన మొట్టమొదటి శిలాశాసనాలు ఇక్కడ ఉన్నాయి.

ధౌళగిరి కొండలమీద దారుణమైన కళింగయుద్ధాన్ని గుర్తుచేసే ఆధునిక శాంతి స్మారకచిహ్నం నిర్మించబడి ఉంది. నగరానికి కొద్ది దూరంలో ఖండగిరి, ఉదయగిరి గుహాలయాల సమూహం-ప్రాచీన జైన సంస్కృతీ వైభవానికి సాక్ష్యాలుగా మిగిలిఉన్నాయి!

## మీకు ఒక క్విజ్
### 14- ఏళ్ళ లోపు పిల్లలకు

1. భువనేశ్వర్‌కు సమీపంలో ఉన్న 'అప్లిక్'(నగిషీ) పనులకు ప్రసిద్ధి గాంచిన పట్టణం ఏది?

..............................................

2. అనేక శతాబ్దాలుగా వస్తూన్న శాస్త్రీయ నృత్యానికి సంబంధించిన వివిధ భంగిమలలో మలచిన అందమైన శిల్పాలు ఇక్కడి గుహాలలో చాలా ఉన్నాయి. ఈ గుహల పేరేమిటి?

..............................................

3. భువనేశ్వర్‌తో మరి రెండు పట్టణాలను కలిపి ఒరిస్సాలోని మూడు పెద్దదేవాలయపట్టణాలుగా చెబుతారు. ఆ రెండుపట్టణాలు ఏవి?

..............................................

మీ సమాధానాలను చుక్కలతో చూపినచోట స్పష్టంగా రాసి, కూపన్‌ను నింపి ఎంట్రీలను కింది చిరునామాకు పంపండి:

**Orissa Tourism Quiz Contest**
**Chandamama India Limited**
**No.82, Defence Officers Colony**
**Ekkatuthangal, Chennai - 600 097**

పేరు :..............................................
వయసు :..............................................
చిరునామా :..............................................
..............................................
పిన్ ........................ ఫోన్ ...........




Winners picked by Orissa Tourism in each contest will be eligible for 3-days, 2-night stay at any of the OTDC Panthanivas, upto a maximum of four members of a family. Only original forms will be entertained. The competition is not open to CIL and Orissa Tourism family members. Orissa Tourism, Paryatan Bhaven, Bhubaneswar - 751 014. Ph : (0674) 432177, Fax : (0674) 430887, e-mail : ortour@sancharnet.in. Website : Orissa-tourism.com



భారత సంస్కృతి-చరిత్ర 29



సంగీత పుష్పం (బే.క) 19



ఉచితబహుమతి 46



బ్రాహ్మడు-బ్రహ్మదేవుడు 36





SUBSCRIPTION

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of Chandmama India Ltd.***
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్‌ద్వారా రూ.120లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా
గానీ,మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్
పేరిట పంపండి':

ఈ పత్రికలో ప్రకటనల
కోసంసంప్రదించండి:

చెన్నయ్
ఫోన్ : 044-234 7384,
234 7399

ఢిల్లీ
మోనా భాటియా
ఫోన్:011-651 5111/
656 5513/656 5516

ముంబాయి
షకీల్ ముల్లా
మొబైల్ :98203-02880
ఫోన్ : 022-266 1599/266
1946/265 3057

వ్యవస్థాపకులు
బి.నాగిరెడ్డి - చక్రపాణి

# గత సంస్కృతితో అనుబంధం!

జపానుకు చెందిన ఒక పత్రికలో ఇటీవల ఒక వ్యాసం వెలువడింది. ఆ దేశంలో ఉపాధ్యాయులు పసిపిల్లలకు అగ్గిపుల్లలు ఉపయోగించకుండా నిప్పు పుట్టించడం ఎలా నేర్పుతారో; కేవలం పాఠ్యపుస్తకాలను ఉపయోగించడంకన్నా, పిల్లలను వస్తుప్రదర్శనశాలలకు తీసుకువెళ్ళడంద్వారా వారికి ప్రాచీన చరిత్రను ఎలా బోధిస్తారో ఆ వ్యాసంలో వివరించబడింది. అక్కడి ఉపాధ్యాయులు తమ బోధనా విధానాలలో ప్రకృతినీ, ప్రదర్శనశాలలనూ చక్కగా వినియోగించుకుంటారు.

అంటే పాఠ్యపుస్తకాల ప్రాముఖ్యతనూ, విలువనూ తక్కువగా అంచనా వేయడం కాదుకానీ; పసిపిల్లలకు ఆసక్తికరంగావిద్యను బోధించడంలో ప్రకృతి పరిశీలన; పర్యటన చాలా అవసరమని గుర్తుచేయడమే మా ఉద్దేశం. ఇలాంటివాటిద్వారా పిల్లలు ప్రపంచాన్ని ప్రత్యక్షంగా చూసి, సులభంగా అర్థం చేసుకోకలుగుతారు.

మనదేశం సువిశాలమైనది. ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క ప్రత్యేకత; చెప్పుకోతగ్గ విశిష్టత; గర్వించతగ్గ సాహితీసంపద ఉన్నాయి. ఆయా ప్రాంతాలకు చెందినపండుగలూ, వేడుకలూ; కళలూ, సంప్రదాయాలూ కోకొల్లలు!

ఒక ప్రాంత ప్రజలను గురించిన విశేషాలను మరొక ప్రాంతంవారు తెలుసుకోవడం సదవగాహనకూ, సమైక్యతకూ దోహదం చేస్తుందని భావిస్తున్నాము. అందుకే మన పత్రికలో ప్రతినెలా ఒక పండుగ, ఒక నాట్యం; ఒక రాష్ట్రానికి సంబంధించిన విశేషాలతో ఆ రాష్ట్ర జానపద కథ ప్రచురించడానికి నిర్ణయించాము.

ఇతర ప్రాంతాలు పర్యటించడం ఆయా ప్రాంత ప్రజల ఆచార వ్యవహారాలు తెలుసుకోవడానికీ; వారిని సన్నిహితంగా చూసి, అర్థంచేసుకోవడానికీ దోహదం చేస్తాయి. అదేవిధంగా వివిధ ప్రాంతాల పండుగలు, విశేషాల గురించి చదువుతూన్నప్పుడు ఆయాప్రాంతాలను పర్యటించిన అనుభూతినీ, ఫలితాలనూ పాఠకులు పొందగలరని ఆశిస్తున్నాము.

''కొద్దిపాటి చరిత్ర రూపొందడానికికొన్ని శతాబ్దాల కాలం పడుతుంది. అలాగే, ఒకసంప్రదాయం రూపుదిద్దు కోవడానికి కొన్ని శతాబ్దాల చరిత్ర అవసరమవుతుంది,'' అని చెప్పిన సుప్రసిద్ధ తత్వవేత్త డా. సర్వేపల్లి రాధాకృష్ణన్ జన్మదినం సెప్టెంబర్ ఐదు.

మన సంప్రదాయ సంస్కృతీ పునాదులు వైభవోపేతమైన దేశ గత చరిత్రలోనే ఉన్నాయన్న సత్యాన్ని ప్రతి ఒక్కరూ గుర్తుంచుకోవాలి. గతంలోని మంచిని స్వీకరించి, ఉజ్వలమైన భవిష్యత్తు నిర్మాణంకోసం యువత ముందుకు సాగాలి!

సంపాదకుడు : విశ్వం



# పాఠకుల లేఖలు

ఇదీ మేం కోరుకునే 'చందమామ'! తరతరాలుగా మమ్మల్ని అలరిస్తున్న చందమామ. కథాసుమాల మాలగా మమ్మల్ని ఎన్నో దశాబ్దాలనుంచి కవ్వించి, నవ్వించి, అలరించి ఆనందింపజేసిన చందమామ! నేనంటున్నది 'జూన్ సంచిక' గురించి. ప్రతి పేజీలోనూ కథలతో మమ్మల్ని పరవశింపజేసింది. **– కె.గౌరీశంకర్, లెక్చరర్, ఒంగోలు**

మేనెల చందమామకన్నా కొత్తగా వచ్చిన జూన్‌నెల సంచిక ఎక్కువ కథలతో నిండుగా కనిపించింది. ఈ ప్రకారంగానే ప్రతినెలా ఎక్కువ కథలను పాఠకులకు అందించమని మా మనవి. అప్పటి కథలను, బొమ్మలను క్వాలిటీతో మళ్ళీ మీరు ప్రచురించి, ఈ తరానికి అందించి టీవీలనుంచి దృష్టి మళ్ళించి మళ్ళీ పుస్తకపఠనంవైపు మొగ్గేలా చేయగలరని మా నమ్మకం. చందమామ తిరిగి పూర్వవైభవంతో ప్రకాశించాలని ఆశిస్తూ ఉన్నాము. యక్షపర్వతం చందమామకే హైలైట్. **– డి.హెచ్. లలిత, తెనాలి**

జూన్ నెల చందమామ చదివాను. అందులోని కథలలో మనిషికి మనిషికీ మధ్య ఏర్పడే అనుబంధాలను చక్కగా వివరించారు. స్థితప్రజ్ఞుడు, మూడుముక్కల మంత్రం, స్నేహధర్మం మొదలైన కథలు చాలా బాగున్నాయి. **– అభిలాష,పాతూరు–502 113**

నా వయసు ముప్పై ఏళ్ళు. ఇరవై ఏళ్ళ క్రితం చందమామ చదివేవాణ్ణి. మూడవ తరగతినుంచి ఏడవ తరగతివరకు చందమామ నా ప్రాణం. మళ్ళీ ఈమధ్యనే చందమామ చదవడం ప్రారంభించాను. నేను కోల్పోయిన రసాత్మక ఆనందం ఇప్పుడు మళ్ళీ పొందుతున్నాను. చందమామ కథలు మనసుకు ప్రశాంతతనిస్తున్నాయి. బుద్ధి వికసిస్తున్నది. ఆనందం వర్ణనాతీతం. **– కందకుర్తి ఆనంద్, కోటపల్లి–503 001**

నేను ముప్పై అయిదు సంవత్సరాలనతుంచీ చందమామ పాఠకుడను. జూన్‌నెల సంచిక చదివితే పూర్వకాలపు చందమామ చదివిన అనుభూతి కలిగింది. ఈ నెలలో జన్మించిన ప్రముఖులు, 'భారత సంస్కృతి–చరిత్ర' వ్యాసాలు విజ్ఞానాత్మకంగా ఉన్నాయి. 'పచ్చదనం–పరిశుభ్రత', 'ఏరు మళ్ళీ పారుతోంది' వ్యాసాలు పిల్లలకు ప్రబోధాత్మకంగా, ప్రస్తుతకాలానికి అవసరం ఏమిటో తెలిపేవిగా ఉన్నాయి. **– దేవభక్తుని విద్యాసాగర్, విజయవాడ–520 010**

పాఠకుల కోరిక మేరకు శీర్షికలు తగ్గించి కథల సంఖ్య పెంచినందుకు చాలా కృతజ్ఞతలు. జూలై చందమామ చాలాబాగుంది. కథలు అద్భుతంగా ఉన్నాయి. యక్షపర్వతం సీరియల్, అజేయుడు గరుడుడు చాలా బాగుంటున్నాయి. **– టి.కృష్ణమోహన్, యనమలకుదురు, కృష్ణాజిల్లా (ఆం.ప్ర)**

చందమామ కథలు, శీర్షికలు చదివిస్తున్నాయి. ఫోటో వ్యాఖ్యలు మాట్లాడుతున్నవి.

**– గుంటి జనార్దన్, తిరుపతి–5 1 7 5 0 1**

మహాభారతం సీరియల్ ఈ నెలలో ముగుస్తున్నందున వచ్చేనెల నుంచి మరో మంచి పౌరాణిక సీరియల్ కోసం ఎదురుచూస్తున్నాం. కవర్‌పేజీ డ్రాయింగ్స్ ప్రతినెలా వడ్డాది పాపయ్యగారి పాతచిత్రాలు తిరిగి ముద్రించగలరు. **– డి.నాగేశ్వరరావు, మచిలీపట్నం (ఆం.ప్ర)**

చందమామ 6 అణాలనుంచి చదువుతున్నాను. జీవితానికి పునాది సత్ప్రవర్తన. చందమామను రెగ్యులర్‌గా చదివే పాఠకులకు సత్ప్రవర్తన అబ్బుతుందనే నా అభిప్రాయం.

**– పి.మల్లీశ్వరరావు, హైదరాబాదు–500 072**



# తొలగిన అజ్ఞానం

రాజుపాలెం అనే గ్రామంలో, రాజయ్య అనే రైతుండేవాడు. అతడు తనకున్న కొద్ది పాటి పొలాన్ని దున్నుకుంటూ,ఏలోటూ లేకుండా జీవిస్తున్నాడు.

ఒక రోజున రామాపురం నుంచి రాజయ్య భార్య తండ్రి గోవిందయ్య, ఒక పాడిగేదెను తోలుకొచ్చాడు. ఆయన రాజయ్యతో, ''అల్లుడూ! నువ్వు చక్కగా వ్యవసాయం చేసుకుంటున్నావు. అలాంటి నీకు పశువుల పాడికూడా వుండాలి. పాడికి, పంట తమ్ముడు అంటారు. నాకీ మధ్య పశుసంపద బాగా పెరిగింది. సంతోషం కొద్దీ ఒక పాడిగేదెను తోలుకొచ్చాను. పంటతో పాటు పాలు పెరుగుల సౌఖ్యాన్నికూడా అనుభవించు!'' అన్నాడు.

మామగారి మాటలకు రాజయ్య నవ్వి, ''మావయ్యా! పాడిపశువును మేపడం మాటలు కాదు. అలాంటి దానివల్ల ఎంత సుఖముందో, సరైన మేత పెట్టలేకపోతే అంత బాధవుంది. పొలంలో నాకు పండిన పంట ఏలోటూ లేకుండా సరిపోతున్నది. వరిపంట నూర్చగా వచ్చే ఎండుగడ్డి, నాదుక్కిటెద్దులకు బొటాబొటీగా సరిపెట్టుతున్నాను. ఇప్పుడు, ఈ గేదె రావడం వల్ల పాలు, పెరుగు సౌఖ్యం మాట దేవుడెరుగు, దీన్ని మేపగల స్తోమత నాకులేదు,'' అన్నాడు.

అప్పుడు రాజయ్య భార్య కనకం కల్పించుకుని, ''మీకు ఈ మధ్య చాదస్తం మరీ పెరిగిపోతున్నది. దుక్కిటెద్దులతో పాటే దీన్నీ మేపుదాం.లక్ష్మీదేవి పాడి, పంటలు రెండింటిలోనూ వుంటుంది. మహలక్ష్మిలా వచ్చిన ఈ పాడిగేదెను వద్దనకండి. గొడ్డొచ్చినవేళ, బిడ్డొచ్చినవేళ శుభం జరుగుతుందని వినలేదా ఏం?'' అన్నది.

ఆ తర్వాత గోవిందయ్యకూడా ఒకటికి రెండుసార్లు చెప్పడంతో, రాజయ్య తన దుక్కిటెద్దులతోపాటుకొట్టంలో మరొండు కట్టుకొయ్యలు పాతి గేదెను, దూడను కట్టేయించాడు.

డా॥ జొన్నలగడ్డ మార్కండేయులు



గోవిందయ్య వచ్చినప్పటికన్న మరింత సంతోషంగా రామాపురం వెళ్ళిపోయాడు. రాజయ్య మర్నాడు గేదెపాలు పిండి ఇంట్లోకి తీసుకువచ్చాడు. భార్య కనకం ఒక చిన్న లోటాలోకి పిండిన పాలు పిండినట్లేపోసి, ''నాన్న మంచితనం వల్ల ఇక మనకు పాలు పెరుగులకు లోటంటూవుండదు. మన పశువుల కొట్టంలో, ఈ పాడిగేదె తొలిగా అడుగుపెట్టింది. ఈ ఆనంద సమయంలో వేణుగోపాలస్వామికి ఈ పాలు నైవేద్యం పెట్టమని పూజారికివ్వండి. ఆ దేవుడి దయవల్ల మనం త్వరలోనే గేదెలకోసం ఇప్పుడున్న కొట్టం పక్కనే మరొక కొట్టం కట్టవలసిరావచ్చు!'' అంటూ పాల లోటాను కళ్ళకద్దుకుని, భర్త చేతికిచ్చింది.

రాజయ్య పాలలోటాను తీసుకుని గుడికి వెళ్ళాడు. ఆ సమయంలో పూజారి ఎవరో సాధువుతో మాట్లాడుతున్నాడు. రాజయ్య, పూజారికి తను వచ్చిన పని చెప్పాడు.

పూజారి, రాజయ్యకేసి ఆశ్చర్యంగా చూసి, ''రాజయ్యా! వేణుగోపాలస్వామికి ఆవుపాలు, ఆవుపాలతో చేసిన పదార్థాలు నైవేద్యం పెట్టడం ఆనవాయితీ. నువ్వు ముందే చెప్పడం వల్ల ఒక అనాచార భయం తప్పింది. లేకపోతే, గోవుల్ని కాచిన గోపాల స్వామికి మంత్రోక్తంగా గేదెపాలు నైవేద్యం పెట్టివుండేవాడిని! సరే, నిన్ను అంతగా నిరాశ పుచ్చదలచలేదు. ఆ పాలేవో నువ్వే స్వామికి నైవేద్యం పెట్టి, వాటిని--కుంభమేళాకు వెళుతూ రాత్రి మన గుడి అరుగుమీద పడుకున్న ఈ సాధువుకు సమర్పించు. పుణ్యం, పురుషార్థం కూడా!'' అన్నాడు నవ్వుతూ.

రాజయ్య బయట నుంచే, వేణుగోపాల స్వామి విగ్రహానికి భక్తిగా నమస్కరించి, పాలలోటాను సాధువు ముందు పెట్టాడు. జరిగిందంతా గమనిస్తున్న సాధువు, పాలను గటగట తాగేసి, రాజయ్యతో, ''చక్కెర లేకుండానే పాలు ఎంతో తియ్యగా వున్నాయి! నీకు తప్పకుండా మంచిజరుగుతుంది,'' అంటూ కళ్ళు మూసుకుని, ఏదో ధ్యానించి, చేతిని గాలిలో ఆడించాడు.

ఆ తర్వాత గుప్పెట తెరిచి, అందులో వున్న రెండు రుద్రాక్ష గింజలు రాజయ్య చేతిలో పెట్టి, ''వీటిని, నీ పూజామందిరంలో వుంచు. నీకూ, నీ వంశానికీ పేరు తెచ్చే ఇద్దరు కొడుకులు పుడతారు,'' అని రాజయ్యను ఆశీర్వదించాడు.

రాజయ్య ఇంటికి తిరిగివచ్చి, జరిగిందంతా భార్య కనకానికి చెప్పాడు. ఇద్దరూ

కలిసి రుద్రాక్ష గింజలను పూజామందిరంలో పెట్టారు. విచిత్రంగా, ఆనాటి నుంచి రాజయ్యకు పట్టింది బంగారమై బాగా కలిసొచ్చింది. కొద్దికాలంలోనే అతడు మరి రెండెకరాల పొలం, మూడు పాడిగేదెలనూ, ఒక ఆవునూ కొన్నాడు. క్రమంగా సాధువు చెప్పినట్టే అతడికి ఇద్దరు కొడుకులు పుట్టారు.

అయితే, ఇద్దరు కొడుకుల మనస్తత్వాలు వేరువేరుగా వుండేవి. పెద్దవాడికెప్పుడూ పొలం పనులంటే ఇష్టం. వాడు రేయింబవళ్ళు పొలంలోనే వుంటూ వ్యవసాయం చెయ్యడమేకాక, వరిపంట విషయంలో రకరకాల ధాన్యపు విత్తనాలను కలిపి ప్రయోగాలు చేస్తూండేవాడు.

ఇక రెండోవాడికి పశువులంటే ప్రాణం. వాటికి చిన్న దెబ్బ తగిలినా విలవిలలాడిపోయేవాడు. వాడు పశువైద్యులనాశ్రయించి సాధారణంగా పశువులకు వచ్చే రోగాలను గురించి తెలుసుకున్నాడు. తనకు తెలిసిన చిట్కా వైద్యాలకు, పశువైద్యులనుంచి సేకరించిన పరిజ్ఞానాన్ని జోడించి, వాడు గ్రామంలో పశువులకు సోకే రకరకాల వ్యాధులను నయం చేయడం ప్రారంభించాడు.

సాధువు తమ కిచ్చిన రుద్రాక్షల మహిమ వల్లే, తమ కుటుంబం ఈనాడు సుఖసౌఖ్యాలతోతులతూగుతున్నదని రాజయ్యా,కనకం నమ్మారు. అలా చాలా సంవత్సరాలు గడిచిపోయాయి.

రాజయ్య పెద్దకొడుకు ఇరవైఏళ్ళవాడయ్యాడు. వాడికి బాగా ఆస్తిపాస్తులున్న కుటుంబాల నుంచి పెళ్ళి సంబంధాలు రాసాగాయి. ఈ స్థితిలో రాజయ్యా, కనకం తమ ఉన్నతస్థితికి కారణం అయిన సాధువుకు కృతజ్ఞతాపూర్వకంగా, వేణుగోపాలస్వామి ఆలయంలో పూజ చేయాలనుకుని, కొడుకులిద్దరితో ఆలయానికి వెళ్ళారు.



కొంతసేపటికి వాళ్ళు పూజ ముగించి బయటికి రాగానే, ఆలయం ముందు నిల బడివున్న ఒకసాధువు కనిపించాడు. ఆయన తలా, గడ్డం బాగా తెల్లబడిపోయివున్నాయి. నడుం కాస్త వంగివున్నది. ఎవరా ఈసాధువు, అని రాజయ్య ఆలోచించేంతలో, సాధువు చిరునవ్వు నవ్వి, ''రాజయ్యా! రాత్రి గుడి అరుగుమీద పడుకుని, గ్రామస్తులు నిన్ను గురించి మాట్లాడుకోవడం విన్నాను. చాలా సంతోషం!'' అన్నాడు.

ఆ మాటలతో రాజయ్య, ఆ సాధువు ఎవరైనదీ గుర్తించి, ''క్షమించండి, స్వామీ! తమర్ని వెంటనే గుర్తించలేకపోయాను. తమరు కరుణించి ఇచ్చిన రెండు రుద్రాక్ష గింజలూ, ఆశీర్వాదబలం వల్ల ఆస్తిపాస్తులు పెరిగి, ఇద్దరు కొడుకులతో సుఖంగా వున్నాను,'' అంటూ, తను వేణుగోపాల స్వామికినైవేద్యంగా పెట్టిన ఆవుపాల లోటాను సాధువుకు అందివ్వబోతూ, ''స్వామీ! ఇవి మా ఇంటి ఆవుపాలు,'' అన్నాడు.

సాధువు పాల లోటాను అందుకోకుండా, ''రాజయ్యా! ఆనాడు జరిగినదేమిటో నాకు బాగాగుర్తున్నది. పూజారి, వేణుగోపాల స్వామిని ఆవులకు మాత్రమే రక్షకుడుగా భావించాడు! ఆయన అజ్ఞానం నాకు ఆశ్చర్యం కలిగించింది. ఆ కారణంగానే, నువ్వు భక్తితో తెచ్చిన గేదెపాలను ఆయన పూజకు పనికి రావనడం విని, నేను తాగాను. నీకు శుభం కలగాలన్న ఆశయంతో రుద్రాక్షలిచ్చి ఆశీర్వ దించాను. వేణుగోపాలుడు నా మాటలు నిజం చేశాడు!'' అన్నాడు.

ఆ సమయంలో, చేతికర్ర ఆసరాతో అక్కడికొచ్చిన పూజారి, సాధువుకు నమస్క రించి, ''స్వామీ! భగవంతుడు సర్వవ్యాపి అని తెలిసినా, అజ్ఞానం కొద్దీ ఆయన ఇష్టా ఇష్టాలు సర్వం ఎరిగినవాడిలా ప్రవర్తించాను. ఎవరేమిచ్చినా గ్రహించి, దానికి రెట్టింపు చేసి ఇస్తాడన్న పరమ సత్యం ఇప్పుడు తెలుసు కున్నాను. నా అజ్ఞానం తొలగింది,'' అన్నాడు.

అది విన్న సాధువు సంతోషంగా పూజారితో పాటు అందరినీ ఆశీర్వదించి, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.






# యక్షపర్వతం

9

[గురుభల్లూకుణ్ణివెంటబెట్టుకుని, ఖడ్గజీవదత్తులు అరణ్యంలోని కొలనుదగ్గరకు వెళ్ళారు. అక్కడ వారికిస్వర్ణాచారి కనిపించాడు. సమరబాహు లేని సమయంలో అతడి అనుచరులకూ, వీరపురం రాజుసైనికులకూ దొమ్మియుద్ధ ం ప్రారంభమైంది. ఆ సంగతి విని మిగిలిన రాజసైనికులు జంతుశాలాధికారి వెంట సమరబాహు అనుచరులమీదికి బయలుదేరారు. -తరవాత]

వీరపుర రాజుగారి జంతుశాలాధికారి వెంట ఇప్పుడు ఏడుగురు సైనికులు మాత్రమే వున్నారు. వాళ్ళల్లో ఒకడు సమరబాహు అనుచరులవల్ల గాయపడి కుంటుతూ, తతిమ్మా వాళ్ళ వెనగ్గా వస్తున్నాడు. సమరబాహు అనుచరులు నలుగురూ, రాజసైనికులు తమకన్న కొంచెం అధికంగావున్నా, ధైర్యంచేసి వాళ్ళమీద కలియబడేందుకు సిద్ధపడ్డారు.

జంతుశాలాధికారి, సమరబాహు అనుచరులకు కొద్దిదూరంలో ఆగి, "ఒరే, మీ వాలకం చూస్తూంటే, మీరేదో బిడారు వర్తకుల్లా కనిపిస్తున్నారు. ఏ రాజ్యంనుంచి వస్తున్నారు? నెత్తిమీద పాగాచుట్టుకునే పద్ధతి అదేనా? కత్తిపట్టే తీరుకూడా మీకు తెలిసినట్టు లేదే!" అన్నాడు హుందాగా.

ఈ మాటలు అవమానంగా తోచిన సమరబాహు అనుచరులు నలుగురూ, మీసాలు దువ్వి, పెద్ద పెడబొబ్బపెట్టి, "ఇప్పుడు కాచుకోండి! సమరబాహుకూ, జై!" అంటూ దూకుడుగా వచ్చి, రాజు వీరసింహుడి సైనికులమీద పడ్డారు. వీరసింహుడి సైనికుల్లో ముగ్గురు మొదటి తాకిడికే, సమరబాహు అనుచరుల కత్తి దెబ్బలకు నేలకొరిగారు. లోగడ గాయపడిన సైనికుడూ, జంతుశాలాధికారీ వెనుదిరిగి చెట్లకు అడ్డంపడి పారిపోసాగారు. తమ పైఅధికారి పారిపోవడం చూసిన, మిగతా



ఇద్దరూ కత్తులు కిందపడేసి, సమరబాహు అనుచరులకు లొంగిపోయారు.

ఈ జరిగిన దొమ్మి యుద్ధమప్పుడు రేగిన రణగొణధ్వనులు విని, చుట్టుపక్కలనుంచి కొందరు ఆటవికులు ఆ ప్రదేశానికి వచ్చారు. వాళ్ళకు ఎవరెవరిమధ్య పోరాటం జరిగిందో, ఎవరు ఓడి ఎవరు గెలిచారో అర్థంకాక ఆశ్చర్య పోయారు.

అదిగమనించినసమరబాహుఅనుచరులు, ఆటవికులతో, "మీరీ అరణ్యంలో నివసించే వాళ్ళేగదా? ఇకనుంచి మీరు వీరపురంరాజుకు కప్పం కట్టనవసరంలేదు. మా రాజైన సమర బాహు, మీ అందరికీ కొత్తరాజు! తెలిసిందా?" అన్నారు ఆజ్ఞాపిస్తున్నట్టు.

ఆటవికుల్లో కొంచెం వయసుమళ్ళినవాడొకడు ముందుకొచ్చి, "అయ్యా, మీరుచెప్పినట్టే చేస్తాం. కోప్పడకండి...తమ రాజుగారి నగరం ఎక్కడ?" అని అడిగాడు భయం భయంగా.

సమరబాహు అనుచరుల్లో ఒకడు, వాడికి జవాబుచెప్పబోయేంతలో, ఇద్దరు ఆటవికులు, రెండు గుర్రాలను కళ్ళాలు పట్టుకుని వాళ్ళున్న చోటుకు తీసుకువచ్చారు. ఆటవికముసలాడు వాళ్ళను, "వీటిని మీరెక్కడపట్టుకున్నారు?" అని అడిగాడు.

"వీరపురం రాజుగారి సైనికుల్లో ఇద్దరు గుర్రాలెక్కి పారిపోతూ, చెట్లకు కట్టివున్న వీటి తాళ్ళను కత్తులతో నరికి దూరంగా తరిమేయాలని చూశారు. మేం పారిపోతున్న వీటిని లాఘవంగా పట్టుకున్నాం," అన్నారు గుర్రాలను తెచ్చిన ఆటవికులు.త

"మా రాజుగారికి చెప్పి, మీ లాఘవానికి తగినబహుమతి ఇప్పిస్తాం. ఈ గుర్రాలురెంటినీ మావెంట కొండకోట నగరానికిపట్టుకురండి," అన్నాడొక సమరబాహు అనుచరుడు.

ఆటవికులిద్దరూఅందుకుఅంగీకరించారు. సమరబాహు అనుచరులు, తమకు బందీలుగా దొరికిన వీరసింహరాజు సైనికులిద్దరినీ వెంట బెట్టుకుని, తమ ఒంటెలున్న చోటుకు బయలు దేరారు. దారిలో వాళ్ళకు రాజుగారి జంతుశాలాధికారిపట్టుకుని పెద్దపెద్దబోనుల్లోబంధించిన సింహం, పులులూ కనిపించినై

సమరబాహుఅనుచరులువాటిని చూస్తూనే ఉత్సాహంగా, "ఈక్రూరమృగాలు సమరబాహు మహారాజుగారు ఏర్పాటుచేయనున్న జంతు ప్రదర్శనశాలలో సుఖంగా జీవిస్తాయి. వీటిని మనతో కొండకోట నగరానికి తీసుకు పోదాం," అన్నారు.

ఆ సమయంలో మరికొందరు ఆటవికులు అక్కడికి వచ్చారు. సమరబాహు అనుచరులు బోనుల్లోవున్న సింహం, పులుల కేసి పరీక్షగా

చూసి, "అంతా బాగానే వుంది. మేమేనాడూ క్రూరమృగాలను మచ్చిక చేసినవాళ్ళంకాదు. ఈ బోనుల్ని కోటదగ్గరకు తరలించడం ఎట్లా?" అని అడిగారు ఆటవికులను.

అప్పుడు ఆటవిక ముసలాడు ముందుకు వచ్చి, "అయ్యా, ఈ బోనులన్నీ చిన్న చక్రాల బళ్ళమీద అమర్చినవి. మీరు వాటిని గుర్రాల చేతగాని, ఒంటెలచేతగాని, మీ నగరానికి లాగించుకుపోవచ్చు," అన్నాడు.

ఇందుకు సమరబాహు అనుచరులు సరే నంటూ తలలూపగానే, ఆటవికులు సింహం, పులులూవున్న బోనులను తాళ్ళతో రెండు ఒంటె లకు కట్టారు. మరొకదాని వెన్నుమీద అడవిపక్షు లున్న వలలనుబిగించారు. తరవాత అందరూ కలిసి అమిత ఉత్సాహంతో, సమర బాహు కొండ మీద కోట కడుతున్న ప్రాంతానికి బయలుదేరారు.

కొండమీద రాళ్ళను అటూ ఇటూ మోయిస్తూ, కోటగోడలు కట్టిస్తున్న స్వర్ణాచారి, కొండదిగువున కనిపించిన ఒంటెలనూ, గుర్రాలనూ, వాటివెంటవున్న ఆటవికులనూ చూసి ఎక్కడలేని ఆశ్చర్యంపొందాడు. సమరబాహు అనుచరులు మోసేరాళ్ళను కిందపడవేసి, కొండ అంచుకు వచ్చి, దిగువనున్న గుర్రాల కేసీ,ఆటవికులుకేసీ చాలావింతగా చూడ సాగారు.

గుర్రంమీద వున్న సమరబాహు అనుచరు డొకడు,తలెత్తి పైకిచూసి, పక్కనవున్నవాడితో, "ఒరే! ఆచారి మహామంత్రిగారు మనల్నిచూసి అద్భుతపడిపోతున్నట్టున్నది. ముందుగా పోయి ఆయనకు సంగతి సందర్భాలు మనవి చేస్తాను," అంటూ గుర్రం మీది నుంచి దిగి, రాళ్ళమీదుగా గెంతుతూపోయి స్వర్ణాచారిని సమీపించాడు.





స్వర్ణాచారి తనకేసి వస్తున్న సమరబాహు అనుచరుణ్ణి, "మీరు పోయింది వేటకుగదా? ఆ గుర్రాలెక్కడివి? ఏవో పులిబోనులు తెస్తున్నారేమిటి? ఆ ఆటవికులు ఇక్కడి కెందు కొస్తున్నట్టు?" అని ఆదుర్దాగా ప్రశ్నించాడు.

సమరబాహు అనుచరుడు, స్వర్ణాచారికి నమస్కరించి, "ఆచారి మహామంత్రీ! మేము అరణ్యంలో వీరపురంరాజు సైనికులను బాహాబాహి యుద్ధంలో చిత్తుగా ఓడించాం. ఇద్దర్ని బందీలుగా పట్టుకున్నాం. ఏడుగుర్ని నిలువునా నరికేశాం. ఇద్దరు మాత్రం ప్రాణాలతో తప్పించుకుని వీరపురంకేసి పారిపోయారు," అని చెప్పాడు.

ఇద్దరు వీరపురంకేసి పారిపోయారని వింటూనే, స్వర్ణాచారి నిలువెల్లా కంపించి పోయాడు. అతడికి సమరబాహు సైనికుడు చెప్పిన మిగతావేవీ ఆనందం కలిగించలేదు. అతడు కోపంతో కళ్ళెర్రచేసి, "రాజు వీరసింహుడి సైనికులిద్దరు నగరంకేసి పారిపోయారని చెప్పావ్! అదే మనకు త్వరలో ప్రాణ సంకటంగా పరిణమించవచ్చు. ఏదో యజ్ఞాశ్వాలను పట్టుకున్నంతగా సంతోషపడిపోతూ, దొరికిన ఆ కుంటి గుర్రాలు రెంటినీ వెంటబెట్టుకుని వస్తున్నారా? అసలా రాజసైనికులతో మీరెందుకు కలహం పెట్టుకున్నారు?" అని ప్రశ్నించాడు.

సమరబాహు అనుచరుడు స్వర్ణాచారి కోపం చూసి, తాము చేసినది తప్పయివుంటుందని భావించి, ఉన్నవీ లేనివీ కొన్ని కల్పించి అతడికి చెప్పాడు. ఆ సైనికులు సమరబాహును అవమానిస్తూ మాట్లాడారనీ, గుంపుగా వచ్చి ఒంటెలమీదపడి తోలుకు పోతూంటే, వాళ్ళతో కలబడవలసి వచ్చిందనీ ఇలాగే మరికొన్ని అబద్ధాలు చెప్పాడు.

స్వర్ణాచారి కొంచెంసేపు మౌనంగా వూరుకుని, తర్వాత అక్కడ చేరిన సమరబాహు అనుచరులతో, "ఏది ఏమైనా, మనకు ఆ వీరపురం రాజుతో విరోధం రావలసిందికాదు. పారిపోయిన సైనికులిద్దరూ రాజుకు జరిగిందంతా చెబుతారు. రాజు పెద్ద సైన్యంతో వచ్చి, ఇంకా నిర్మాణదశలోనే వున్న మన కోటను ముట్టడిస్తాడు. సమయానికి సమరబాహు మహారాజిక్కడలేడాయె! ఆ క్షత్రియ మహా యోధులైన ఖడ్గ జీవదత్తులున్నా, మనం ఎలాంటి ప్రమాదాలనైనా గడిచేవాళ్ళం," అన్నాడు.

స్వర్ణాచారి ఊహించినట్టే, అరణ్యంలో సమరబాహు అనుచరులకు దొరక్కుండా గుర్రాలమీద పారిపోయిన జంతు ప్రదర్శన శాలాధికారీ, సైనికుడూ, వీరపురనగర రాజ వీధిగుండా తమ గుర్రాలను దౌడు తీయిస్తూ,

"దేశానికి ప్రమాదం! రాజ్యానికి ముప్పు! శత్రురాజు అరణ్యంలో ఆకాశాన్నంటే కోట గట్టి, మనమీద దాడికి సేనావాహినులను తరలించుకు వస్తున్నాడు!" అని కేకలు వేయసాగాడు.

ఆ సమయంలో రాజప్రాసాదంపైన మంత్రితో మాట్లాడుతున్న రాజు వీరసిం హుడు, వాళ్ళ కేకలు విని ఆశ్చర్యపోతున్నంతలో, జంతుప్రదర్శనశాలాధికారీ, సైనికుడూ కోట ద్వారం దగ్గరకు వచ్చారు. కాపలాభటుడు, అతణ్ణీ, సైనికుణ్ణీ గుర్రాలు దిగి లోపలికి పొమ్మన్నాడు.

జంతు ప్రదర్శనాధికారి అందుకు ఒప్పుకోక పెద్దగా గొంతెత్తి, "ఏమిటి నువ్వనేది? ఒక వైపున దేశం ప్రమాదంలో చిక్కుకునుంటే, ఈ లాంఛనాలతో కాలం వృధా చెయ్యాలని చూస్తున్నావా?" అన్నాడు.

ఇంతలో సైనికుడు గుర్రాన్ని వేగంగా ద్వారం దాటించబోయేసరికి, కాపలాభటుడు ఈటెనుతిప్పి వాడిడొక్కలో ఒకపోటుపొడిచాడు. సైనికుడు గుర్రంమీదినుంచి తల్లకిందులుగా కిందపడిపోతూ, "వీరసింహ మహారాజుకూ, జై!" అంటూ గట్టిగా కేక పెట్టాడు.

మంత్రి చేయెత్తి కాపలాభటుణ్ణి కేకవేసి, "ఒరే వాళ్ళిద్దర్నీ త్వరగా లోపలికి రానియ్యి!" అని చెప్పాడు.

జంతుప్రదర్శశాలాధికారీ, సైనికుడూ భవనంపైకి వచ్చి రాజుకూ, మంత్రికీ నమస్క రించి నిలబడ్డారు. అప్పుడు మంత్రి, జంతు ప్రదర్శనశాలాధికారిని, "రాజ్యానికిప్రమాదమా? ఎవరు దండెత్తి వస్తున్నారు?" అని అడిగాడు.

జంతుప్రదర్శనశాలాధికారి రాజూ,



మంత్రులకు మరొకసారి నమస్కారంచేసి, "ప్రభూ! నేను జంతుప్రదర్శనశాలకు పశుపక్ష్యాదుల్ని పట్టుకువచ్చేందుకు, కొందరు సైనికులతో అరణ్యానికి వెళ్ళాను. అక్కడ సమరబాహు అనే కొండకోటరాజు సైనికులు ఒంటెలమీద పెద్దదండుగా వచ్చి, మా మీద పడ్డారు. మేము వాళ్ళందర్నీ వీరోచితంగా ఎదు ర్కొని చాలామందిని మా వాడికత్తులకు ఎర చేశాం. మనసైనికుల్లో కొందరు గాయపడ్డారు, కొందరి కత్తులు శత్రువులను నరికీ నరికీ బండ బారాయి. మనవాళ్ళందరూ వీరోచితంగా నేల కొరిగారు. నేనూ, మిగిలిన ఒక సైనికుడూ ఈ వార్త తమకు తెలిపేందుకు శత్రు వ్యూహాన్ని ఛేదించుకుని మెరుపు వేగంతో నగరం చేరాం," అని చెప్పాడు.

రాజు వీరసింహుడు వెంటనే, "మహా మంత్రీ! మనరాజ్యపు సరిహద్దుప్రాంతాల



బలమైన శత్రువు చేరినట్టు తెలుస్తున్నది. సేనానికోసం కబురు పంపండి,'' అన్నాడు.

మంత్రికి, జంతుశాలాధికారి చెప్పిన మాటల్లో నమ్మకం కుదరలేదు. ఆయన అతణ్ణి కొంచెం దగ్గరకు రమ్మని, గుండ్రంగా ఒకసారి తిరగమని ఆజ్ఞాపించాడు. అతడి శరీరం మీద చిన్న గాయంగానీ లేక శత్రువుల కత్తిదెబ్బకు దుస్తుల్లో ఎక్కడైనా చిన్న చిరుగు గానీ వుంటుందేమోనని ఒకసారి పరీక్షగా చూశాడు. కానీ అలాంటివేమీ మంత్రి కంట బడలేదు.

ఇంతలో అక్కడికి, ఒరలోని కత్తిని టక టకలాడించుకుంటూ సేనానాయకుడు వచ్చి; రాజుకూ, మంత్రికీ నమస్కరించాడు. మంత్రి అతడితో జంతుప్రదర్శనాధికారి చెప్పినది వివరించాడు.

సేనాని వినయంగా, ''మహామంత్రిగారు క్షమించాలి! ఈ ఒంటెలవాళ్ళ గురించి పూర్తి సమాచారం సేకరించుకు రమ్మని కొందరు వేగులవాళ్ళను, నిరంజనుడనేవాడి నాయ కత్వంలో పంపాను. అయితే, వాడు ఆ ప్రాంతాల గల ఒక అందమైన ఆటవికజాతి కన్యను పెళ్ళాడి, ఆటవికులలో కలిసిపోవడంతో, పూర్తి సమాచారం సంపాయించడం కొంత ఆలస్యమైంది,'' అన్నాడు.

''ఆ ఆలస్యాన్ని శత్రువులు బాగా ఉపయో గించుకున్నట్టున్నది!'' అన్నాడు మంత్రి కోపంగా. తర్వాత ఒక క్షణం ఆగి, ''సేనానీ! వేగులవాళ్ళను ఎన్నుకునేటప్పుడు, వాళ్ళకు పెళ్ళాం బిడ్డలున్నారో లేదో తెలుసుకోవడం చాలాముఖ్యం. బ్రహ్మచారుల్ని వేగుల వాళ్ళుగా పంపితే ఏం జరుగుతుందో అనుభవం అయింది కదా?'' అన్నాడు.

అప్పుడు రాజు కల్పించుకొని, ''సేనానీ! నువ్వు వెంటనే సైన్యాలతోపోయి శత్రురాజు కోటను నేలమట్టంచేసి, రాజును సజీవంగా బంధించి తీసుకురావలసిందిగా ఆజ్ఞాపిస్తు న్నాను,'' అన్నాడు.

సేనాని వెంటనే, ''చిత్తం!'' అంటూ కదిలి, నూరుమంది గుర్రపు రౌతులను, రెండు వందల కాల్బలాన్నీ వెంటబెట్టుకుని, సమర బాహు అనుచరులు కోటకడుతున్న ప్రాంతా నికి బయలుదేరాడు.

సమరబాహు ఎలుగ్గొడ్డుముఠావాళ్ళకు బందీగా చిక్కిననాటినుంచీ, స్వర్ణాచారే అతడి అనుచరులందరికీ నాయకుడుగా వ్యవహ రిస్తున్నాడు. అరణ్యంలో వేటకుపోయిన తన వాళ్ళు, ఆటవికుల్నీ, బోనుల్లోవున్న క్రూర మృగాలనూ వెంటబెట్టుకు తిరిగివచ్చి, జరిగిన సంగతి చెప్పగానే, స్వర్ణాచారి నిర్మాణదశలో వున్న

కొండకోటను రక్షించేందుకు అవసరం అయిన జాగ్రత్తలన్నీ తీసుకోసాగాడు.

ఒకవేళ వీరపురరాజు దాడికివచ్చి, తన వాళ్ళు అపజయం పాలైతే, పారిపోయేందుకు వీలుగా, కొండలోవున్న రెండు సొరంగ మార్గాలను ఎన్నుకుని అతడు తగిన జాగ్రత్తలో వున్నాడు. ఆటవికులకు తినుబండారాలూ, కొంత ధనం ఇచ్చి, వాళ్ళను శత్రుసైనికులు కొండ ఎక్కివచ్చేందుకు సులువైనమార్గం వున్నచోట, ఒక గుహలో దాగివుండమన్నాడు. బోనుల్లో వున్న సింహం, రెండు పులులూ ఆటవికుల అధీనంలో వున్నవి. శత్రు సైనికులు కోటమీదికి ఆ మార్గాన వచ్చే సమయంలో, ఆటవికులు సింహాన్నీ, పులులనూ బోనుల్లోంచి వాళ్ళమీదికి వదలాలి! అప్పుడు శత్రు సైనికుల్లో చెలరేగే గందరగోళాన్ని అవకాశంగా తీసుకుని, వాళ్ళు తిరిగి అరణ్యంలోకి పారిపోవచ్చు. లేదా సమరబాహు అనుచరులకు సాయంచేసి, అతడివల్ల మరికొన్ని అమూల్యమైన బహుమతులను పొందవచ్చు...

ఈ విధంగా స్వర్ణాచారి, నిర్మాణదశలో వున్న కోట రక్షణకు సన్నద్ధంగావున్న సమయంలో, ఒకనాటి సూర్యోదయం వేళ వీరపుర సైన్యం దాడికి వస్తున్నట్టు, అరణ్యంలో కాపలా వున్న సమరబాహు అనుచరులద్వారా అతనికి వార్త అందింది. స్వర్ణాచారి, తన వాళ్ళకు ఈటెలూ, వడిసెలలూ ఇచ్చి, కొండ కిందికి శత్రువులు రాగానే,ఎలాంటి హెచ్చరికా లేకుండా వాళ్ళపైకి విసరమన్నాడు.

కొంతసేపటికి, వీరపుర సేనాని అశ్వికులతో,కాల్బల సైనికులతో కొండకిందికి వచ్చి, కత్తిదూసి పైనున్న సమరబాహు అనుచరులకేసి చూసి, గొంతెత్తి, ''ఒరే, నేను వీరపురరాజ్య ప్రధాన సేనానాయకుణ్ణి! మీరంతా ఆయుధాలు దూరంగా పారేసి లొంగిపోయారోసరి, లేకపోతే అందర్నీ చిత్రవధచేస్తాను,'' అంటూ కేకపెట్టాడు.

ఆ వెంటనే కొండమీదవున్న సమర బాహు అనుచరులు, ఒక్కుమ్మడిగా వడిసెలలనూ, ఈటెలనూ వీరపుర సైనికుల మీదికి విసిరారు. ఈటెల్లో ఒకటివచ్చి, వీరపుర సేనాని భుజంలో గుచ్చుకున్నది. -(ఇంకావుంది)



# మామగారి అనుమానం!

ఒక చిన్న పట్టణంలో, కేశవమూర్తి అనే చిత్రకారుడుండేవాడు. అతడు ఎంత ప్రయత్నించినా ప్రజాదరణ లభించలేదు. ఎప్పుడైనా ఎవరైనా వచ్చి తమ చిత్రం గీయించుకున్నా, తిరిగి మరొకసారి ఆ ఛాయలకన్నాడా వచ్చేవారుకాదు.

ఈ పరిస్థితుల్లో కేశవమూర్తి స్నేహితుడొకడు, అతడితో, ''పట్టణంలో వున్న అంతంతమాత్రపు చిత్రకారులంతా రెండు చేతులా సంపాయిస్తున్నారు. నీకేమో చెప్పుకోదగిన ఆదాయమంటూ లేదు. ఒకపని చెయ్యి. ఇది పెళ్ళిముహూర్తాల సమయం. కొత్తగా పెళ్ళాడిన దంపతులు, ఆ ఉత్సాహంలో తమ చిత్రాలు గీయించుకునే అవకాశం వున్నది. దారేపోయే నలుగురికీ కనబడేవిధంగా, లోగడ నువ్వు గీసిన చిత్రాన్నొకదాన్ని, ఇంటి ముఖద్వారం పక్కగా పెట్టు,'' అని సలహా ఇచ్చాడు.

సలహా చిత్రకారుడికి నచ్చింది. అతడు తనకు పెళ్ళయిన కొత్తలో, భార్యతో కలిసివున్న చిత్రాన్ని గీశాడు. దాన్ని తెచ్చి ముఖంద్వారం దగ్గరపెట్టాడు.

వారంరోజుల తర్వాత కేశవమూర్తి మామ, కూతుర్నీ, అల్లుణ్ణీ చూడవచ్చి, ద్వారం దగ్గిరవున్న చిత్రాన్ని గుచ్చి చూస్తూ, ''కేశవా! ఈ చిత్రంలో వున్న అమ్మాయి ఎవరు?'' అని అడిగాడు.

''ఎవరేమిటి, మామయ్యా, నీ కూతురే!'' అన్నాడు కేశవమూర్తి.

''అలాగా! అయితే, మా అమ్మాయి పక్కన మరెవరో మగవాణ్ణి చిత్రించావేమిటి?'' అన్నాడు మామ కోపంతో రుసరుసలాడిపోతూ.






బేతాళ కథలు

# సంగీత పుష్పం!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, సర్వసాధారణంగా దేశపాలకులైన రాజులు వైభవ, విలాస జీవితాలకు అలవడివుంటారు. అలాటి వారిని అతి కఠోరమైన శ్రమలకోర్చి, తాము కోరినది సాధించుకు రమ్మని ఆజ్ఞాపించగలవాడు రాజాధిరాజో, చక్రవర్తో అయివుండాలి. నువ్వు అలాంటి ఏదో ఒక వ్యక్తి ఆజ్ఞాపాలనకు తల ఒగ్గి, ఇంత అర్ధరాత్రివేళ శ్మశానంలో నానా ఇక్కట్లకూ పాలవుతున్నావని భావిస్తున్నాను. అయితే, నువ్వు కార్య సాధనలో విఫలుడివైనా సఫలుడివైనా,



వర్తమాన జీవిత పరిస్థితులకు లొంగిపోయి, భవిష్యత్తులో రాజోచితమైన వైభవజీవితానికి తిలోదకాలొదిలే ప్రమాదమున్నది. అలాటిది, ఏ సాధు సన్యాసులకో తప్ప రాజులకు తగని పని. ఈ సందర్భంగా, నీకు తగు హెచ్చరికగా వుండేందుకు గంధర్వుడనే గొప్ప గాయకుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

చింతలపాడు అనే గ్రామంలో కుబేరుడు, సుచేలుడు అనే ఇద్దరు భాగ్యవంతులున్నారు. ఇద్దరికీ పెద్దపెద్ద ఇళ్ళున్నాయి. ఇళ్ళ వెనక విశాలమైన ఆవరణలున్నాయి. వందేసి ఎకరాల పంటపొలాలున్నాయి. అన్నింటికీ మించి, ఇద్దరిలోనూ చెప్పలేనంత మంచితన ముంది. ఎటొచ్చీ వాళ్ళ ప్రవర్తన తీరులోనే పెద్ద తేడా వుంది. కుబేరుడికి ధన సంపాదనమీద ఆసక్తి ఎక్కువ. సుచేలుడికి కళాపోషణ అంటే మక్కువ. ఊరికి ఏ కళాకారుడు వచ్చినా సుచేలుడు తన ఇంటికి ఆహ్వానించి ఘనసన్మానంచేస్తాడు. అన్ని సదుపాయాలూ చూస్తాడు. కుబేరుడు ఇవేమీ చేయడుకానీ అడిగితే తనకు తోచిన బహుమానం మాత్రం యిస్తాడు.

ఇలావుండగా-గంధర్వుడనే గొప్ప గాయకుడి దృష్టి చింతలపాడుమీద పడింది. ఎందుకంటే, తన పూర్వీకులావూళ్ళోనే వుండే వారని, ఇటీవలే ఆయనకు తెలిసింది.

గంధర్వుడి అసలుపేరు ఏమోకానీ చాలా ఏళ్ళక్రితం ఒక మహారాజు ఆయన పాట విని ఆ పేరుపెట్టాడు. ఆయన ఎన్నో నగరాల్లో తన పాటను వినిపించి అంతులేని ఖ్యాతినీ, ధనాన్నీ ఆర్జించాడు. తనపూర్వీకులు చింతల పాడులో వుండేవారని తెలియగానే, ఆయనకు అక్కడికి వెళ్ళాలనిపించింది. తన పాట ఆ గ్రామస్థులకు వినిపించాలని కోరికపుట్టింది.

అయితే ఇందుకు ఒకసమస్య ఎదురైంది. చాలా సంవత్సరాలుగా గంధర్వుడు వైభవ జీవితానికి అలవాటుపడ్డాడు. ప్రతిరోజూ కేవలం తనకని నిర్ణయించిన ప్రత్యేకమైన కొలనులో పన్నీటిస్నానం చేస్తాడాయన. భోజనానికి నాలుగు ప్రాంతాలనుంచి రప్పించిన వంటవాళ్ళున్నారు. వాళ్ళు నలుగురూ కలిసి చర్చలు జరిపి, ప్రతిరోజూ ఒక కొత్తవంటకాన్ని సృష్టించి వండుతారు. మనసు ఉల్లాసంగా వుండడంకోసం రోజూ కాసేపు అందగత్తెల నాట్యాన్ని తిలకిస్తాడు. వాతావరణంలో వేడి ఎక్కువైతే ఆయన భరించలేడు. ఆయన కోసం ఒక మహాశిల్పి కోరినప్పుడల్లా చల్లని గాలిని వీచే శీతల యంత్రాన్ని తయారుచేసి యిచ్చాడు. అది లేనిదే ఆయనకు నిద్రపట్టదు.

ఇలా పలువిధాల విలాస జీవితానికి అలవాటు పడ్డ గంధర్వుడు, తన మందీ మార్బలాన్ని భరించగల గొప్పభాగ్యవంతులున్న ఊళ్ళకే వెళ్ళి, తన పాటలు వినిపిస్తూంటాడు. చింతలపాడు చిన్నగ్రామం కాబట్టి అక్కడ తనకు ఆశ్రయమివ్వగల స్తోమతు ఎవరికైనా వున్నదేమో తెలుసుకురమ్మని, పుళిందుడనే అనుచరుణ్ణి ఆ గ్రామానికి పంపాడు.

పుళిందుడు చింతలపాడు వెళ్ళి, కుబేరుడి గురించీ, సుచేలుడి గురించీ తెలుసుకుని, ముందుగా కుబేరుడింటికి వెళ్ళాడు. కుబేరుడు, పుళిందుడు చెప్పిన వివరాలన్నీ విని, "మా ఇంట్లో సకల సదుపాయాలూ వున్నాయి. గంధర్వుడికి ఆశ్రయమివ్వడానికి, నాకే అభ్యంతరమూ లేదు. అయితే నాకు సంగీతమేకాదు, ఏ కళలపట్లా ఆసక్తిలేదు. అందువల్ల ఆయనతో కాలక్షేపం చేయలేను. ఉన్నంత కాలం ఆయన్ను పట్టించుకోవడం ముఖ్య మనుకుంటే మాత్రం సుచేలుణ్ణి కలవడం మంచిది," అన్నాడు.

పుళిందుడు, సుచేలుణ్ణికూడా కలుసుకుని విషయం చెప్పాడు. సుచేలుడు బ్రహ్మానందం చెంది, "గంధర్వుడంతటివాడు, ఈ ఊరు రావడం మా అందరి మహద్భాగ్యం. నేనాయన కోసం ప్రత్యేకమైన కొలను తవ్విస్తాను. ఆరితేరిన వంటవాళ్ళనూ, నాట్యకత్తెలనూ రప్పిస్తాను. ఆయన ఇక్కడ వున్నంతకాలం, ఆయన తోడిదే నా జీవితం," అన్నాడు.

ఇది విని పుళిందుడెంతో సంబరపడ్డాడు. తిరిగివెళ్ళి గంధర్వుడికి విషయం వివరించాడు. గంధర్వుడుకూడా ఎంతో సంతోషించి, నెల రోజుల్లో తను చింతలపాడు వస్తున్నట్లు



సుచేలుడికి కబురంపాడు.

గంధర్వుడు చింతలపాడు ప్రయాణానికి సిద్ధమవుతున్న సమయంలో, అనుకోకుండా మహారాజునుంచి పిలుపువచ్చింది. రాజమాతకు జబ్బుచేసింది. రెండు రోజులుగా అపస్మారకస్థితిలో వుంటూ, ఈరోజే కళ్ళు తెరిచింది. స్పృహలోకి రాగానే ఆమె గంధర్వుడి పాట వినాలని కోరింది.

ఆరోజుకు తన ప్రయాణం వాయిదా వేసుకుని గంధర్వుడు రాజాంతఃపురానికివెళ్ళి, రాజమాతకు తన పాటను వినిపించాడు. ఆమె పులకించిపోయి, "ఏ మందులూ నాకింత ప్రశాంతతనివ్వలేదు. ఒక నెల రోజులపాటు ప్రతిరోజూనాకు, నీ పాట వినిపించాలి," అని కోరింది. రాజాజ్ఞను మీరలేని గంధర్వుడు, తన ప్రయాణం ఒకరోజు కాదనీ, మరొక నెల



రోజులు వాయిదా పడిందనీ సుచేలుడికి కబురు పంపాడు.

అలా వారంరోజులు గడిచాక, రాజవైద్యుడు గంధర్వుణ్ణి పిలిచి, "నీపాట అపూర్వమైనది. రాజమాతను ఒక అంతుపట్టని వ్యాధి పీడి స్తున్నది. ఇంతకాలం నాకూ చికిత్సా విధానం తోచలేదు. నెలరోజులపాటు ఆమెకు నీ పాట వినిపించు. ఆతర్వాతనీకొకగింజను యిస్తాను. అది తీసుకుని నీవు అడవికి వెళ్ళు. నీకు సాయంగా ఇద్దరంటే ఇద్దరు రాజభటులు వస్తారు. వారు నీ అవసరాలు చూస్తారు. పాట పాడుతూ ఒకచోట గింజను పాతు. పాట పాడుతూ అక్కడ రోజూ కాసిని నీళ్ళు పోయి. మొక్కలేస్తుంది. రోజూ ఆ మొక్కకు నీ పాట వినిపించు. ఆరునెలల్లో ఆ మొక్క పుష్పిస్తుంది. పాట పాడుతూ తొలి పుష్పాన్ని త్రుంచి తీసుకువచ్చి నాకివ్వు. ఆ పుష్పంతో తయారుచేసిన మందుతో, రాజమాతకు పూర్తిగా వ్యాధి నయమవుతుంది. అయితే, నీవు అడవిలో వున్న ఆరు నెలలూ కంద మూలాలూ, కాయగూరలూ, ఫలాలూ, పాలూ, నీరూ తప్ప ఇంకేమీ ఆహారంగా స్వీక రించకూడదు. ఆహారంలో కానీ, అలవాట్లలో కానీ కృత్రిమత్వం వుండకూడదు. వాతావరణం కూడా కృత్రిమత్వం వుండకూడదనే, నిన్ను అడవికి వెళ్ళమంటున్నాను," అని చెప్పాడు.

ఈ మాటలు చెప్పింది రాజవైద్యుడే అయినా, కావడానికి రాజాజ్ఞ అని గంధర్వుడు అర్థంచేసుకున్నాడు. రాజమాత ప్రాణాన్ని నిలబెట్టడానికి, తనసంగీతం ఉపయోగపడు తుందని ఆయనకెంతో సంతోషం కలిగింది. పుళిందుడిని పిలిచి, సుచేలుడికి స్వయంగా ఈ జరిగింది చెప్పమన్నాడు.

పుళిందుడు వెళ్ళి గంధర్వుడిప్పట్లో చింతలపాడు రాలేడని సుచేలుడికి చెప్పాడు. అన్ని ఏర్పాట్లు పూర్తిచేసి సుచేలుడు, గంధ ర్వుడి రాక కోసం ఎదురుచూస్తున్నాడు.

సుచేలుడు పుళిందుడితో, "ఏర్పాట్లు భగ్నమయ్యాయని, నేనేం కలవరపడడం లేదు. వచ్చేముందు పదిరోజుల వ్యవధి నాకిస్తే, మళ్ళీ ఇన్నిఏర్పాట్లూ ఇంతగొప్పగానూ చెయ్య గలను. గంధర్వుడిరాకకోసంనేనువేయి కళ్ళతో ఎదురుచూస్తున్నానని చెప్పు!" అన్నాడు.

పుళిందుడు తిరిగివెళ్ళి, పూసగ్రుచ్చినట్లు విశేషాలు గంధర్వుడికి వివరించాడు. గంధ ర్వుడికి సంతోషంతోపాటు ఎంతో ఆశ్చర్యం కూడా కలిగింది. సుచేలుడి ఆతిథ్యం పొంద డానికైనా ఆయన చింతలపాడు వెళ్ళితీరాలని మనసులో అనుకున్నాడు. తర్వాత, అనుకున్న

రోజుకు అడవికి బయల్దేరాడు.

అడవిలో గంధర్వుడు ఆరుమాసాలూ వుండి రాజవైద్యుడు చెప్పినట్లే చేశాడు. మొదట కొద్దిరోజులు ఆయనకక్కడ చాలా కష్టమనిపించింది. కానీ ఆ వాతావరణానికి శరీరం కొంత అలవాటుపడగానే, ఆయనకు ఎంతో హాయిగా కూడా అనిపించింది. ఆయన గొంతులో రోజుకొక కొత్తరాగం, మును పెన్నడూ ఎరుగని మాధుర్యంతో వెలువడ సాగింది.

తర్వాత, గంధర్వుడు తన సంగీతంతో పూయించిన పుష్పాన్ని తీసుకుని రాజధానికి వెళ్ళాడు. ఆ పుష్పంతో తయారు చేసిన మందుతో రాజమాత జబ్బు చేత్తో తీసేసినట్లు మాయమైంది. రాజు సంతోషించి గంధర్వు డికి ఘన సన్మానం చేశాడు.

ఆ సమయంలో గంధర్వుడి సంగీత పుష్ప వైద్యంగురించి పొరుగు రాజుకు తెలిసింది. పొరుగు రాజు గంధర్వుడి అపూర్వ గానాన్ని వినకోరుతూ, ఈ రాజుకు కబురు పంపాడు. వెంటనే పొరుగు రాజ్యానికి బయల్దేరవల సిందిగా రాజాజ్ఞ అయింది. మందీ మార్బ లంతో పొరుగు రాజ్యానికి వెళ్ళాడు గంధర్వుడు.

గంధర్వుడిపాట వినగానేపొరుగు రాజుకు ఎన్నడూ ఎరుగని మనశ్శాంతి కలిగింది. ఆయన, గంధర్వుణ్ణి శాశ్వతంగా తన ఆస్థా నంలో ఉంచేసుకోవాలనుకున్నాడు. కానీ అందుకు గంధర్వుడి దేశపు రాజు ఒప్పుకోడని తెలుసు. ఏం చేయాలో తెలియక ఆయన, రాజవైద్యుణ్ణి సలహా అడిగాడు.

వైద్యుడు వెంటనే, ''మహాప్రభూ! చాలా కాలంగా మీరు మనశ్శాంతిలేక బాధపడు తున్నారు. ఇంతకాలం మనశ్శాంతి కలిగించే మందు లేదనుకున్నాను కానీ, గంధర్వుడి పాటలో గొప్ప విశేషమేదో వుంది. ఆ పాటలోని కొత్తదనం కూడా ఒక కారణం కాబట్టి, కొంత కాలం గడిచాక ఆయన పాట మీకు పాతబడి మళ్ళీ మనశ్శాంతి కొరవడవచ్చు. ఒకానొక వైద్య శాస్త్రంలో సంగీత పుష్పం ప్రసక్తి వున్నది. పొరుగుదేశపు రాజమాతకు వలెనే, తమరూ గంధర్వుడి చేత సంగీత పుష్పాన్ని తెప్పించుకో గలిగితే శాశ్వత మనశ్శాంతి పొందగలరని, నా అభిప్రాయం,'' అన్నాడు.

పొరుగురాజు కోరగా గంధర్వుడు మళ్ళీ అడవికి బయలుదేరి వెళ్ళాడు. ఆరంభంలో ఇబ్బంది అనిపించినా, కొన్నాళ్ళకు ఆ జీవితమే బాగుందని అనుకున్నాడు. వైద్యుడు చెప్పినట్టే సంగీత పుష్పాన్ని పూయించి పొరుగురాజుకు ఇచ్చి, తన రాజ్యానికి తిరిగి వెళ్ళాడు. కొద్ది



రోజుల్లోనే మళ్ళీ విలాసజీవితానికి అలవాటు పడిపోయాడు.

అప్పుడొకరోజునపుళిందుడు, గంధర్వుడికి చింతలపాడు గురించి గుర్తుచేశాడు. ఆ మరు క్షణం గంధర్వుడు, "నేను వస్తున్నట్లుగా చింతలపాడులో కుబేరుడికి కబురు పంపు. నా విడిది అక్కడే!" అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, గంధ ర్వుడి నిర్ణయం చూస్తూంటే, అతడేదో అయో మయావస్థలో వున్నట్లు కనబడుతున్నది. ఎంతో కాలంగా సుచేలుడు, అతడిరాక కోసం ఎదురు చూస్తున్నాడు. అటువంటి వాడిని విడిచి, తనపట్ల అంతగా ఆసక్తిలేని కుబేరుడి ఇంట విడిదిచేస్తాననడం మతి మాలిన నిర్ణయంగా లేదా? అడవిలో వుండి ఏమాత్రం వైభవ విలాసాలులేని జీవితానికీ, నగరంలో విలాసమయ జీవితానికీ అల వాటు పడగలగడంతో, తను ఎక్కడైనా ఎటువంటి మార్పుకైనా అలవాటుపడి పోగలనన్న ధీమా గంధర్వుడిలో కలిగిందా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఇతరుల ఒత్తిడీ, బలవంతం లేకుండా మనిషి స్వేచ్ఛగా తనకై తాను కోరుకున్న మార్పు కొత్త ఉత్సాహాన్ని స్తుందనేది నిజం. అయితే, గంధర్వుడు తీసుకున్న నిర్ణయానికి కారణం సంగీత పుష్పం. సంగీత పుష్పం కారణంగా, అతడి చింతలపాడు ప్రయాణం రెండుమార్లు వాయిదాపడింది. మళ్ళీ వాయిదా పడదన్న నమ్మకంలేదు. నిలకడలేని తన ప్రయా ణాలతో తనను ఎంతగానో అభిమానించే సుచేలుణ్ణి యిబ్బందిపెట్టలేడు. గంధ ర్వుడి కోసం అతడు మరొకసారి భారీఎత్తున ఏర్పాట్లుచేసి నష్టపోయే ప్రమాదంవున్నది. అందువల్లనే, గంధర్వుడి రాకగురించి అంతగా పట్టించుకోని కుబేరుడి ఇంట విడిదిచేయడం మేలనుకున్నాడు. అంతేకాని అతడి నిర్ణయంలో అయోమయస్థితిగానీ, మతిమాలినతనంగానీ ఏమాత్రం లేదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -(కల్పితం)

[ఆధారం "వసుంధర" రచన]



మన పండుగలు

# ఓణం వేడుకలు!

దేవుడి సొంత దేశంలోనే పండుగసమయంగా కొనియాడబడేది కేరళలోని ఓణం పర్వదినం! ఓణం అనగానే - వాకిళ్ళలో అందమైన రంగు రంగుల పుష్పాలంకరణలు; కొబ్బరిచెట్ల మధ్య జలాశయాలలో అత్యుత్సాహంగా సాగే పడవల పోటీలూ గుర్తుకు వస్తాయి.

ఋతుపవనాలు ముగియగానేనేలంతా పచ్చపచ్చగా పడుచు దనంతో పరవళ్ళు తొక్కుతూన్న సమయంలో జరుపుకునే ఓణం-కేరళకు చెందిన రెండు ప్రధానమైన పండుగలలో ఒకటి. మరొకటి ఏప్రిల్‌లో వచ్చే విషు. పంటలూ, ఫలాలూ పుష్కలంగా ఉంటూ సుదీర్ఘమైన వేడుకలు జరుపుకోవడానికి కావలసినంత విరామం, ఉత్సాహం లభించే కాలం!

కేరళ ప్రాంతంలో దాదాపు వెయ్యి సంవత్సరాలకుపైగా ఓణంను ప్రధానమైనపండుగగా జరుపుకుంటున్నారు. క్రీ.శ. 861 చెందిన ఒక తామ్రఫలక శాసనంలో ఓణం వేడుకలకు సంబంధించిన ప్రస్తావన ఉంది!

కొత్త సంవత్సరంలోని తొలి మాసమైన చింగొమ్ ( ఆగస్ట్-సెప్టెంబర్) నెలలో ఓణం వస్తుంది. అంటే, శ్రావణ లేదా భాద్రపద మాసంలో శ్రావణ నక్షత్రం రోజున జరుపుకుంటారన్నమాట. ఇంటింటా కనీసం ఒక వారం రోజులైనా ఓణం వేడుకలు జరుపుకుంటారు. మరికొందరయితే అత్తం (హస్త) నుంచి తిరుఓణం (శ్రావణం) వరకు పది రోజులపాటు జరుపుకుంటారు.



# మహాబలి పునరాగమనం!

ఒకానొకప్పుడు మహాబలి అనే అసురరాజు, కేరళ ప్రాంతాన్ని పరిపాలించేవాడు. ఆయన ధర్మశీలుడూ, నీతి వర్తనుడూ, సమర్థుడూ కావడంతో ఆయన పాలనలో ప్రజలు ఏ కొరతా లేకుండా సిరిసంపదలతో, సుఖశాంతులతో వర్ధిల్లారు.



బలి మహాశక్తిసంపన్నుడు కావడంతో తన అధికారాన్ని మూడు లోకాలకూ విస్తరిల్లజేశాడు. ఆయన కీర్తి ప్రతిష్ఠలు చూసి దేవతలు ఓర్వలేకపోయారు. క్రమంగా ఆయన దేవతల ద్వేషానికీ, కోపాగ్నికీ గురయ్యాడు. తమ స్వర్గాన్ని వశపరచుకున్న బలిని ఎలాగైనా శిక్షించాలని దేవతలు విష్ణువును ప్రార్థించారు.

విష్ణువు సరైన అవకాశంకోసం ఎదురుచూడసాగాడు.

మహాబలి అశ్వమేధయాగం చేయడానికి సంకల్పించి దీక్ష బూనాడు. అదేమంచితరుణంగా భావించి మహావిష్ణువు వామన రూపంలో యాగశాలదగ్గరికి వచ్చాడు. యాగదీక్షబూనిన రాజులు, విప్రులు ఏది అడిగినా తక్షణమే దానంగా ఇవ్వడం సంప్రదాయం. దాని ప్రకారం, బలి వామనుణ్ణి ఏం కావాలో కోరుకోమన్నాడు. వామనుడు తన బుల్లిపాదాలు కొలిచే మూడడుగుల నేల కావాలన్నాడు.

గురువు శుక్రాచార్యుడు వారిస్తున్నా వినకుండా బలి, వామనుడికి మూడడుగుల నేల దానంగా ధారపోశాడు.

అంతే! వటుడు ఇంతై-ఇంతింతై పెరిగి ఒక పాదంతో భూలోకాన్నంతా కొలిచాడు. రెండవ పాదంతో ఆకాశాన్ని కొలిచాడు. మూడవ పాదం మోపడానికి స్థలం ఎక్కడ అంటూ బలిని ప్రశ్నించాడు. బలి తన తలను చూపాడు. వామనుడు తనమూడవపాదాన్ని బలి తలపై మోపి ఆయన్ను పాతాళానికి అణగ దొక్కాడు. బలి పాతాళానికి చేరేముందు త్రివిక్రముడైన వామనుణ్ణి, యేటా ఒకసారి భూలోకానికి వచ్చి తన ప్రజల యోగక్షేమాలను చూసివెళ్ళే భాగ్యం కల్పించమని వేడుకున్నాడు. విష్ణువు అందుకు సరేనన్నాడు.



అలా బలిచక్రవర్తి యేటా భూలోకానికి తిరిగివచ్చే సందర్భాన్ని పురస్కరించుకునే ఓణం పండుగ ఏర్పడిందని చెబుతారు.

ఓణం పండుగ జరిగే పదిరోజులలో ఏదో ఒకనాడు తమ ప్రియతముడైన రాజు తమ ఇళ్ళను వెతుక్కుంటూ వచ్చి, తమ బాగోగులు చూసి వెళతాడని ప్రజలు విశ్వసిస్తారు. అందువల్ల రాజుకు ఘనస్వాగతం పలికేవిధంగా తమ ఇళ్ళను శుభ్రపరచి వివిధ పుష్పాలతో అలంకరిస్తారు.

పండుగరోజులలో స్త్రీలూ, పిల్లలూ, వేకువజామునే లేచి వెళ్ళి, రకరకాల పువ్వులనూ, ఆకులనూ సేకరించుకుని వచ్చి, వాటితో ఇళ్ళ ముందు వివిధ ఆకారాలతో చాలా అందంగా అలంకరిస్తారు. ఆకర్షణీయమైన ఈపుష్పాలంకరణను 'పూక్కోలం' అంటారు. అందరూ కొత్తబట్టలు ధరిస్తారు. ఒకరికొకరు కానుకలు

మహాబలితో పాటు ఆయన్ను పాతాళానికి అణగదొక్కిన వామనుణ్ణి కూడా పూజించడం ఇటీవల ఆచారంగా మారింది. వాకిళ్ళముందు మహాబలి, వామనులకు సంకేతంగా చతురస్రాకారంలో మట్టి ముద్దలు అమర్చి పూలతో అలంకరిస్తారు. అయితే, తొలినాళ్ళలో వామనుణ్ణి పూజించే ఆచారంలేదు.





ఇస్తారు. తమ గొప్ప రాజును కీర్తిస్తూ హాయిగా పాటలు పాడతారు.

ఆ పది రోజులపాటు రకరకాల సంప్ర దాయ వంటలు చేసుకుని తింటారు. స్త్రీలు మనగొబ్బిలాంటి 'కైకొట్టిక్కళి' అనే జానపద నృత్యం చేస్తారు.

వీటన్నిటికన్నా ఆకర్షణీయమైనవీ; పిల్లలకూ, పెద్దలకూ ఉత్సాహం కలిగిం చేవీ ఓణం సందర్భంగా జరిగే పడవ పందాలు. ఇరువైపులా కొబ్బరిచెట్లుగల జలాశయాలలో పడగెత్తేపాడువాటి పాము లాంటి ఆకారంలో ఉన్న కొన్ని పడవలకు వందమందికి పైబడ్డ యువకులు తెడ్డు వేస్తూ పోటీలలో పాల్గొంటారు.

ఇలాంటి పెద్ద పడవలేకాకుండా చిన్న చిన్న పడవలలో పిల్లలుకూడా పడవస్వారీ చేస్తారు. అవిధంగా పిల్లలకూ-పెద్దలకూ, స్త్రీలకూ-పురుషులకూ ఆనందం కలిగించే పండుగ ఓణం. మొత్తం మీద ఓణం పండుగ వేడుకలు ఆనందోత్సాహాల మేళ వింపుగా ఉంటాయి!

## జతచేయండి :

కింద కనబరచిన పదాలను, వాటికి సంబం ధించిన వాటితో జతచేయండి చూద్దాం!

1. కైకొట్టిక్కళి ఎ) ఓణంరోజు ధరించే కొత్తబట్టలు
2. ఓణక్కోడి బి) పడవ పందెం
3. పూక్కళం సి) ఓణంనాటి విందు
4. వళ్ళంకళి డి) ఒక జానపద నృత్యం
5. ఓణస్సద్య ఇ) నేలపై చేసిన పువ్వుల అలంకరణ

జవాబులు : 1-డి; 2-ఎ; 3-ఇ;
4-బి; 5-సి

# 20. రాజు ఎడమకన్ను ఎందుకు ఏడ్చింది?



"తాతయ్యా! నదీతీరంలోవున్న దేవాలయంలో జరుగనున్న యజ్ఞం గురించి మీరు విన్నారా? కొందరు పెద్దలు తలపెట్టిన ఈ యజ్ఞానికి మన పట్టణంలోవున్న ధనికులందరూ విరాళాలు ఇస్తున్నారు!" అంటూ గది లోపలికి అడుగు పెట్టాడు సందీపుడు.

"అలాగా," అంటూ దేవనాధుడు చదువుతూన్న వార్తాపత్రికను మడిచి పక్కనపెట్టాడు తప్ప, మనవడు చెప్పిన విషయంపట్ల అంతగా ఆసక్తి కనబరచలేదు. అది సందీపుడికి ఆశ్చర్యం కలిగించింది. అయినా దానిని అతడు బయటపెట్టకుండా, "తాతయ్యా! ఈ యజ్ఞం వల్ల ప్రపంచశాంతి కలుగుతుందని వాళ్ళు చెబుతున్నారు. అది నిజమేనా?" అని అడిగాడు.

"ఏమో, నాకు తెలియదు. అయినా, శాంతి అన్నది మనలోపల మనం శ్రద్ధగా అలవరచుకోవలసిన విషయం. అది వెలుపలినుంచి వచ్చేదికాదు. ఆ యజ్ఞంచేసేవారి హృదయాలలో శాంతి ఉన్నట్టయితే, అది ఇతరులమీద కొంత ప్రభావం చూపవచ్చు," అన్నాడు దేవనాధుడు.

"అంటే, ఈహడావుడంతా అనవసరమని భావిస్తున్నారా?" అని అడిగాడు సందీపుడు.

"ఒకవిధంగా అంతే. ఇక్కడమరొకవిషయం గుర్తుంచుకోవాలి. యజ్ఞాలు జరిపే పూజారులు అమిత భక్తిశ్రద్ధలతో, ప్రశాంత వాతావరణంలో జరిపినట్టయితే, ఆ యజ్ఞంలో పాల్గొంటున్న ప్రజల మనోభావాలమీద కొంత ప్రభామం చూపవచ్చు!" అన్నాడు దేవనాధుడు.

విశ్వావసు



"మరయితే, పూర్వకాలంలో తరచూ యజ్ఞయాగాలు చేసేవారని చెబుతారుకదా! మరి అవన్నీ కేవలం ఆచారంకోసం చేసినవేనా?" అని అడిగింది టీ కప్పుతో అప్పుడే గదిలోపలికి అడుగుపెట్టిన జయశ్రీ.

చిరునవ్వుతో టీ కప్పును అందుకున్న దేవనాథుడు, "యజ్ఞం అన్న భావన కాలప్రవాహంలో ఎన్నో మార్పులకు లోనయింది. మొట్టమొదట మానవుడు దైవంతో సంబంధం పెంచుకోవటానికి ఒక ప్రేరణగా యజ్ఞం ఆరంభమయింది. మనిషి అహంభావాన్ని త్యజించి, తన సంకల్పాలనూ, చేతలనూ త్రికరణశుద్ధిగా భగవంతుడికి సమర్పించే పవిత్ర కృత్యం యజ్ఞం. యజ్ఞం అంటే మన ఆశలను దేవుడికి ఆహుతిచేయడం. ఉదాత్త ఆధ్యాత్మిక యజ్ఞం అంటే అదే! మరికొన్ని యజ్ఞాలు ఉన్నాయి. వీటిద్వారా ప్రార్థనల రూపంలో తమ కోరికలను దేవుడికి విన్నవించుకుంటారు. ఇప్పుడు ప్రపంచ శాంతికి యజ్ఞాలు చేస్తున్నారుకదా? అదేవిధంగా ఒకప్పుడు సంతానం కోసం, కీర్తికోసంకూడా యజ్ఞయాగాలు చేసేవారు. ఏది ఏమైనా మనిషిని మహోన్నత దివ్యశక్తులతో సంధానపరచడమే యజ్ఞం ధ్యేయంగాఉండేది," అన్నాడు దేవనాథుడు.

"అంటే, యజ్ఞంలోకూడాచాలా రకాలున్నాయన్నమాట! యజ్ఞకుండాలలో నిప్పు రగిలించి అందులో రకరకాల వస్తువులు వేసేవారు. అంతేకదా!" అని అడిగాడు సందీపుడు.

"యజ్ఞానికి బాహ్య సంకేతం అగ్నికుండం! అగ్నిజ్వాలలు పైకెగసినట్టే, మనిషి ఆలోచనలు, కోరికలు ఊర్ధ్వముఖంగా, ఉన్నతంగా ఉండాలి. మంటలు మలినాలను హరించి, స్వచ్ఛతను సమకూర్చేవిధంగా, యజ్ఞాలు మనసులోని మలినాలను హరించి, నైర్మల్యాన్ని ప్రసాదించాలని మన పూర్వులు కాంక్షించారు. మనకున్నదంతా దైవప్రసాదంగా భావించి, వాటిని భక్తితో దైవానికి సమర్పించే బుద్ధి ఉన్నంతకాలం; అసలైన యజ్ఞం మనలో నిరంతరాయంగా సాగుతూనే ఉంటుంది. సాధారణ లౌకిక జీవితంలో సైతం - ప్రాణప్రదంగా భావించినవాటిని; ఇంతెందుకూ, ప్రాణాలను సైతం త్యాగంచేసిన మరపురాని మహనీయులు పలువురు కనిపిస్తారు. హరిశ్చంద్రుడి కథ మనకు తెలుసు. కర్ణుడి దాతృత్వం గురించి తెలియనివారంటూ ఉండరు. యాచించిన వారికి లేదనకుండా ఇవ్వాలన్న తన వ్రతానికి భంగం రాకుండా, తన ప్రాణాలకు రక్షణగా నిలిచిన కవచకుండలాలనే శరీరం నుంచి కోసి ఇచ్చిన పుణ్యమూర్తి కర్ణుడు. ఆయన దాతృత్వాన్ని చాటే మరొక ఉదంతాన్ని, ఇప్పుడు చెప్పుకుందాం. ఆయన ఒకనాడు కొందరు అతిథులతో కలిసి భోజనం చేస్తున్నాడు.



అప్పుడు భవనం వాకిట్లోకి ఒక ముని వచ్చాడు. తన కుమార్తె వివాహానికి కొంత ధనం కావాలని యాచించాడు. కర్ణుడు ఆ మాట వినగానే, కుడిచేత్తో భోజనం చేస్తున్నాడు గనక, ఎడమ చేత్తో తన మెడలోని రత్నాలహారాన్ని తీసి భటుడి కిచ్చి, మునికి అందజేయమన్నాడు. కర్ణుడితో కలిసి భోజనం చేస్తున్న ఒకఅతిథి, ''దానధర్మాలు కుడిచేత్తోనే చేయాలన్న నియమం తమకు తెలియదా? అయినా భోజనం ముగించి, ఆ తరవాత హారాన్ని తీసి దానంచేసి ఉండవచ్చు కదా? అంత తొందర ఎందుకు?'' అంటూ తన అనుమానం వెలిబుచ్చాడు.

''భోజనం పూర్తిచేసి వచ్చేలోగా మనసు మారిపోదని ఎవరు చెప్పగలరు? మనసు చంచలమైనదికదా? ఇతరుల మేలుకోరే మంచి ఆలోచనలు వచ్చిన క్షణమే ఆచరించాలి. ఎవరి కైనా హానిచేయాలనుకుంటే మాత్రం శాంత చిత్తంతో, ఒకటికి పదిసార్లు ఆలోచించాలి!'' అన్నాడు కర్ణుడు.

''అలాంటి కరుణాస్వభావులు నిజంగానే ఉండేవారా తాతయ్యా?'' అని అడిగాడు సందీపుడు.

''ధీరోదాత్తులైన కరుణాస్వరూపులు పలువురు ఉండేవారు; ఇప్పుడూ ఉన్నారు. నిజానికి అలాంటి ఉత్తమగుణాలు నీలోనూ ఉన్నాయి. ఆ విషయం మాకందరికీ తెలుసు. మనలోవున్న అలాంటి ఉన్నత గుణాలను జాగృతం చేయడానికే మన పురాణాలు, ప్రాచీన సాహిత్యం అలాంటి పుణ్యాత్ములను గురించి పదేపదే మనకు గుర్తుచేస్తున్నాయి. నీకు మయూరధ్వజ మహారాజు కథ తెలుసా?'' అని అడిగాడు దేవనాధుడు.

''తెలియదు, తాతయ్యా!'' అన్నాడు సందీపుడు.



"అలాగా! అయితే ఆ మహానుభావుడి కథ చెబుతాను, విను," అంటూ దేవనాథుడు ఇలా చెప్పసాగాడు:

ధర్మరాజు హస్తినాపురాన్ని పాలించే కాలంలో మణిపుర రాజ్యాన్ని మయూరధ్వజుడనే రాజు ఏలుతూ ఉండేవాడు. ధర్మరాజు రాజసూయ యాగం ప్రారంభించినప్పుడే, మయూరధ్వజుడు కూడా తన శ్రేయోభిలాషుల సలహాప్రకారం రాజసూయం చేయడానికి సంకల్పించాడు.

రాజసూయ యాగారంభంలో భూప్రదక్షిణకు యాగాశ్వాన్ని వదిలేవారు. సైనికులు వెంటరాగా, యాగాశ్వం వివిధరాజ్యాలు నిరాటంకంగా తిరిగివచ్చినట్టయితే, ఆయారాజ్యాల రాజులు యాగాశ్వం పంపిన రాజును తమ చక్రవర్తిగా అంగీకరించినట్టు భావించడం సంప్రదాయం.

ధర్మరాజు వదిలిన యాగాశ్వం వెంట కృష్ణార్జునులు దానికి రక్షణగా బయలుదేరారు. వారి యాగాశ్వం మణిపురరాజ్యాన్ని సమీపిస్తూండగా, మయూరధ్వజుడు వదిలిన యాగాశ్వం ఆయన కుమారుడు తామ్రధ్వజుడి రక్షణతో వస్తూన్నట్టు తెలిసింది. దానిని ఎలాగైనా పట్టి బంధించాలని కృష్ణార్జునులు ఆశించారు. అయితే మయూరధ్వజుడి యాగాశ్వం అటువైపు వచ్చినప్పుడు ఎదురుచూడనిదేదో జరిగిపోయింది. కృష్ణార్జునులు యాగాశ్వంకేసి చూస్తూ స్థాణువుల్లా ఉండిపోయారేతప్ప, తమను దాటుకుని వెళుతూ ఉంటే దానిని ఏమీ చేయలేక పోయారు.

మయూరధ్వజ మహారాజు చాలా గొప్పవాడనీ; ఆయనకు దేనిమీదా ఆశఅన్నది ఏ కోశానాలేదనీ; శుభఘడియల్లో ఎవరేది అడిగినా ఇచ్చే ధర్మ ప్రభువనీ అక్కడి ప్రజలు చెప్పుకోవడం కృష్ణార్జునుల చెవినపడింది. ఆ మాటలలో వాస్తవమెంతో తెలుసుకోవాలన్న ఉత్సాహంకొద్దీ కృష్ణార్జునులు మామూలు బాటసారులుగా వేషాలు మార్చుకుని మయూరధ్వజుడి దగ్గరికి వెళ్ళారు.

"మహారాజా! మేము అరణ్యమార్గం గుండా పయనిస్తూండగా, భయంకరమైన సింహం ఎదురుపడి నా కొడుకును పట్టుకున్నది. మా ఇద్దరిలో ఒకరిని భక్షించి, నా బిడ్డను ప్రాణాలతో వదిలిపెట్టమని బ్రతిమలాడాము. అయితే, ఆ సింహం ఒక సత్పురుషుణ్ణి ఆహారంగా తీసుకువస్తే తప్ప నా బిడ్డను వదలనని పట్టు పట్టింది. అలాకాని పక్షంలో సత్పురుషుడూ, పరమ భక్తుడూ అయిన మానవుడి సగం శరీరంతో సరిపెట్టుకుంటాననీ, అటువంటి పుణ్యపురుషుడు తమరే అనికూడా తెలియజేసింది ప్రభూ! నా బిడ్డ ప్రాణం రక్షించడానికి తమరు అర్ధశరీరం త్యాగం చేయగలరా?" అని అడిగాడు బాటసారి వేషంలోని కృష్ణుడు.

ఆ మాటలను తెరచాటునుంచి విన్న మయూరధ్వజుడి భార్య వారిని చూసి, వారి ఎదుటికి వచ్చి, "భార్యను అర్ధాంగి అంటే భర్త

శరీరంలో సగం అని అంటారుకదా! నా భర్తకు బదులు నన్ను సింహం దగ్గరికి తీసుకువెళ్ళండి. అది నన్ను భక్షించి మీ కుమారుణ్ణి విడిచిపెడు తుంది,'' అన్నది.

''నీ సూచన బాగానే ఉన్నదిగానీ, అందులో ఒక చిక్కు ఉంది. భార్య భర్తలో సగభాగం అన్నది నిజమే. అయితే అది ఎడమభాగం మాత్రమే. సింహం రాజు శరీరంలో కుడి భాగాన్ని మాత్రమే కోరుకుంటున్నది,'' అన్నాడు కృష్ణుడు వినయంగా.

మయూరధ్వజుడు చప్పున లేచి నిలబడి, ''ఇంకా ఎందుకు ఆలస్యం? సింహానికి ఆకలె క్కువయితే, ఓర్పు కోల్పోయి నీ బిడ్డకేదైనా హానిచేయవచ్చు. ఇదిగో ఖడ్గం! దీనితో నా శరీ రాన్ని సగంగా నరికి, కుడిభాగాన్ని మృగరాజుకు ఆహారంగా తీసుకు పో!'' అంటూ ఖడ్గాన్ని కృష్ణుడికి అందించాడు.

కృష్ణుడు ఖడ్గాన్ని అందుకుని రాజును నిలు వునా రెండుగా నరకబోతున్నట్టు నటిస్తూ ముం దుకు ఉరికి ఆగిపోయాడు. ఆ సమయంలో రాజు ఎడమ కంటి నుంచి కన్నీటి బొట్టు జారడం గమనించాడు. ''శరీరంలో సగభాగం ఇవ్వవలసి వచ్చిందే అని నువ్వు బాధ పడు తున్నావు. లేకుంటే నీకంటివెంట ఆ నీళ్ళేమిటి? బాధతో ఇష్టం లేకుండా ఇచ్చే దానం పుచ్చు కోకూడదన్న విషయం నీకు తెలియదా?'' అని అడిగాడు.

''మిత్రమా! కన్నీటిబొట్టు రాలింది నా ఎడమ కంటినుంచే అన్నవిషయం నువ్వు గమనించలేదా? ఎదుటివారికి ఉపయోగపడ డానికి శరీరంలో కుడిభాగం చేసుకున్న పుణ్యం, ఎడమభాగం చేయలేకపోయిందికదా అన్న బాధతోనే ఎడమకన్ను ఏడ్చింది! అంతే. నీ పని కానివ్వు!'' అన్నాడు రాజు.

మరుక్షణం కృష్ణార్జునులు తాము ఎవరైనదీ చెప్పి, మయూరధ్వజుడి అపూర్వ త్యాగనిరతిని అభినందించి, స్నేహహస్తం అందించారు. ఆయన రాజసూయ యాగం పరిసమాప్తమయ్యే వరకూ అక్కడే ఉండి, ధర్మరాజు చేస్తున్న రాజసూయా నికి ఆయన్ను ఆహ్వానించి, వెంటబెట్టుకుని వచ్చారు.

''అమోఘం! గొప్పకథ!'' అన్నది ఆనందంతో జయశ్రీ.

''మహాద్భుతమైన మానవశక్తి మీద మన పూర్వులు ఉంచిన విశ్వాసం నిజంగానే అమోఘ మైనది. ఇలాంటి కథల ద్వారా మనం గ్రహించ వలసిన సందేశం కూడా అదే!'' అన్నాడు దేవ నాథుడు. -(ఇంకావుంది)







భారతీయ నృత్యాలు:

# భరత నాట్యం!

లయాన్వితమైన పదవిన్యాసాలతో, భావస్ఫోరకమైన భంగిమలతో సాగే అద్భుతమైన భరత నాట్యాన్ని చూసి పరవశం చెందని రసజ్ఞులు ఉండరు. సాక్షాత్తు బ్రహ్మదేవుడే ఈ నాట్య పద్ధతిని సృష్టించాడని చెబుతారు!

ఒకానొకప్పుడు దేవతలూ, గంధర్వులూ కలిసి బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి-సర్వేంద్రియాలనూ ఆకర్షించి అలరించే అందమైన పంచమవేదాన్ని సృష్టించమని ప్రార్థించారట. బ్రహ్మదేవుడు ఋగ్వేదంనుంచి 'పాఠ్యాన్నీ', యజుర్వేదంనుంచి 'అభినయాన్నీ', సామవేదం నుంచి 'సంగీతాన్నీ', అధర్వవేదం నుంచి 'రసాన్నీ' గ్రహించి, ఈ నాలుగు అంశాలను మిళితంచేసి 'నాట్య వేదాన్ని' సృష్టించి దానిని భరతమునికిచ్చి, మానవ జాతికి బోధించమని ఆదేశించాడు. ఈ నాట్యవేదం ఆధారంగానే భరతముని సుప్రసిద్ధమైన 'నాట్యశాస్త్రా'న్ని రచించాడని చెబుతారు. భారతీయ నాటకం; నాట్యం; సంగీతం మొదలైనవాటికి సంబంధించిన విషయాలను విపులీకరించే ప్రామాణిక గ్రంథం ఇది. భరతముని పేరు మీదుగానే ఈ నాట్యానికి 'భరతనాట్యం' అనే పేరు వచ్చిందని కూడా చెబుతారు.

భారతదేశంలోని అతి ప్రాచీనమైన శాస్త్రీయ

నృత్యాలలో ప్రధానమైనది భరతనాట్యం. ఈ నాట్యానికి సంబంధించిన వివిధ భంగిమలలో మలిచిన శిల్పాలు తమిళనాడులోని దేవాలయాలలో చాలా ఉన్నాయి. సంగం కాలానికిచెందిన శిలప్పదిగారం; మణిమేగలైమొదలైన ప్రాచీన తమిళగ్రంథాలలోనూ ఈ నాట్యం గురించిన ప్రస్తావన కనిపిస్తుంది.

మన పురాణాలప్రకారం పరమశివుడే నాట్యాలన్నిటికీ అధిదేవుడు; ఆయనే నటరాజు! పార్వతీ పరమేశ్వరులు ప్రదర్శించిన తొలి దివ్య నాట్యం ఇది అని కూడా అంటారు. పరమ శివుడు చేసిన శక్తివంతమైన నాట్యంపేరు 'తాండవం'. దీనిని సంతోషంగా చేస్తే ఆనంద తాండవం అనీ, ఆగ్రహంతో చేస్తే 'రుద్ర తాండవం' అనీ అంటారు.

పార్వతీదేవి చేసిన నాట్యం మృదువైనది; సుతారంగా సాగేది. దీనిని 'లాస్యం' అని అంటారు.

భరతనాట్య ప్రదర్శనలో పాడే పాటలు–మన పురాణాలకూ, ప్రాచీన సాహిత్యానికీ సంబంధించినవే. గాయనీ గాయకులకు తోడుగా మృదంగం, వయొలిన్‌తోపాటు 'నాట్యాచార్యులు' కూడా ఉంటారు.

ప్రాచీనకాలంలో దేవదాసీలు, రాజనర్తకీమణులు మాత్రమే ఈ నాట్యాన్ని దేవాలయాలలో, రాజసభలలో ప్రదర్శించేవారు. సంగీత నాట్యకళాప్రియులైన తమిళరాజులు వీరిని పోషించారు.దేవదాసీ విధానాన్ని చట్టంద్వారా నిషేధించడంతో, 20 వ శతాబ్దారంభంలో ఈ కళ కాస్త వెనుకబడింది. అదృష్టవశాత్తు ఈ నాట్యం అంతటితో అంతరించిపోలేదు. స్వాతంత్ర్యానంతరం పలువురు కళాకారిణులూ, నాట్యాభిమానులూ భరత నాట్య పునరుద్ధరణకు పాటు పడ్డారు.అలాంటి వారిలో ఇ.కృష్ణ అయ్యర్, బాల సరస్వతి, రుక్మిణీదేవి అరుండేల్, కళానిధి, శాంతారావు మొదలైనవారి కృషి మున్నెన్నదగినది.





❖ భావ, రాగ, తాళయుక్తమైన నాట్యం గనకే దీనికి 'భరత' నాట్యం అనే పేరు వచ్చిందని ఒక అందమైన వివరణకూడా ఉంది.

❖ ఈనాట్యం నేర్చుకునే కళాకారిణులు పెద్దల సమక్షంలో మొట్టమొదట ఇచ్చే ప్రదర్శనను 'అరంగేట్రం' (రంగ ప్రవేశం) అని అంటారు. ఇది చాలా ముఖ్యమైనది.

❖ అరంగేట్రానికి ముందు గజ్జెపూజ చేస్తారు. పూర్వకాలంలో 'అరంగేట్రం' పూర్తికాకుండా విద్యార్థినులను కాళ్ళకు గజ్జెలు కట్టుకోవడానికి అనుమతించేవారు కాదు.

## బెంగాల్ జానపద కథ

పశ్చిమ బెంగాల్ రాష్ట్రాన్ని ఆనుకుని బంగ్లాదేశ్, నేపాల్, భూటాన్ దేశాలు ఉన్నాయి. ఉత్తర అక్షాంశరేఖ 21 డిగ్రీలు - 27 డిగ్రీలు , తూర్పు రేఖాంశరేఖ 86 డిగ్రీలు - 89 డిగ్రీల మధ్య ఉంటూ, బంగాళా ఖాతాన్ని తూర్పు సరిహద్దుగా కలిగివుంది.

మనదేశంలో సముద్రతీరంలో ఉన్న తొమ్మిది రాష్ట్రాలలో పశ్చిమబెంగాల్ ఒకటి. అయినా ఈ రాష్ట్రంలో నెలకొన్న విభిన్నమైన నైసర్గిక పరిస్థితులు, శీతోష్ణస్థితులు, వైవిధ్యమైన నివాస ప్రాంతాలు మరెక్కడా కనిపించవు. దీని నైసర్గిక స్వరూపం- సముద్రతీర సమతలప్రాంతాలనుంచి, మంచుగడ్డలతో నిండిన హిమాలయ శిఖరాల వరకు విస్తరించి వుంది. మన దేశంలో విస్తారమైన మాంగ్రోవ్ అడవులూ, ప్రపంచంలోనే ఎత్తయిన పర్వత శ్రేణులూ ఇక్కడే ఉన్నాయి. ఏడు ఈశాన్య రాష్ట్రాలకు బెంగాల్ సింహద్వారంగా ఉంటోంది. 88,752 చ.కి.మీ విస్తీర్ణంతో 8,02,21,171 జనాభా కలిగివుంది.

పశ్చిమ బెంగాల్ సుందర్‌బన్స్‌లోని మాంగ్రోవ్ అడవులు జగత్‌ప్రసిద్ధమైన రాయల్ బెంగాల్ టైగర్లనే పులులకు నిలయం. ప్రాజెక్ట్ టైగర్ పథకం కింద సుందర్‌బన్స్‌ను కేంద్రప్రభుత్వం నేషనల్ పార్క్‌గానూ 'టైగర్ రిజర్వ్' (అభయారణ్యం) గానూ ప్రకటించింది.

# బ్రాహ్మడు - బ్రహ్మదేవుడు

ఒకానొకప్పుడు బెంగాల్‌లోని సోనార్‌పురా అనే చిన్న గ్రామంలో ఒక బ్రాహ్మడు నివసిస్తూండేవాడు. అతనికి ఒక విచిత్రమైన సమస్య ఎదురయింది. అతడు ఎప్పుడు ఎక్కడ ఏ విందుకు వెళ్ళినా కడుపు నిండా తినలేకపోయేవాడు. ఏదో ఒక ఆటంకం కలిగి భోజనాన్ని సగంలోనే వదిలిపెట్టవలసి వచ్చేది. అతడు వేగంగాతిన్నా, నిదానంగాతిన్నా ఈవిధినుంచి తప్పించుకోలేకపోయేవాడు. బ్రహ్మదేవుడు తన నుదుట రాసిన రాతగా దానిని భావించి అతడు తెగ బాధపడిపోయేవాడు.



ఒకనాడు స్థానిక మహారాజావారి భవనంలో జరిగే విందుభోజనానికి రమ్మని బ్రాహ్మడికి ఆహ్వానం వచ్చింది. అతడు ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయిపోయాడు. ''ఈసారి నేను తప్పక కడుపు నిండా విందుభోజనం చేయగలను. వాళ్ళు గౌరవించేలా నా బట్టలను కాస్త శుభ్రంగా ఉతికి పెట్టు,'' అని భార్యను పురమాయించాడు.

మల్లెపువ్వులా ఉతికిన తెల్లటి ధోవతి-కుర్తా ధరించి దర్జాగా బ్రాహ్మడు రాజభవనానికి బయలుదేరాడు. పచ్చటి వరిపైరు మధ్యగా; గాలికి తల ఊపుతూ నిలబడ్డ పొడవాటి కాష్ఫూల్ చెట్ల అందాలనుచూసి ఆనందిస్తూ నడవసాగాడు.

రాజభవనం చేరగానే అతన్ని సేవకులు సాదరంగా ఆహ్వానించారు. విందుభోజనానికి కూర్చోబెట్టారు. పెద్దమెండిపళ్ళాన్ని ముందుంచి, సేవకులు ప్రేమతో వడ్డించారు. ఆ వంటలను చూడగానే బ్రాహ్మడికళ్ళు రెండింతలయ్యాయి. మచర్‌జోల్, ఆలూ పోస్తా, బేగన్‌భాజా, నెయ్యి అన్నం, జల్పాయ్ చట్నీ, తియ్యటి పెరుగు అంటూ ఇరవైరకాల పిండివంటలు. వాటికి తోడు ఇంకా మరికొన్ని పదార్థాలు.

అన్నీసజావుగానేసాగుతున్నాయి. బ్రాహ్మడు తినడం ప్రారంభించాడు. పళ్ళెంలోని పదార్థాలలో నాలుగోవంతు తిన్నాడో లేదో ఉన్నట్టుండి దభీమన్న శబ్దం వినిపించింది. ఖంగారుతో తల పక్కకుతిప్పిచూశాడు. కప్పుకు కట్టివేలాడదీసిన పెద్ద ఉట్టిమీది పెరుగుకుండ, ఉట్టితాడు తెగడంతో నేలపైబడి చెల్లాచెదరైపోయింది. వాటిలో నాలుగైదు పెంకుముక్కలు బ్రాహ్మడి పళ్ళెంలోకి వచ్చిపడ్డాయి. కడుపునిండా తినకుండానేఅతడు అక్కణ్ణించి లేవవలసివచ్చింది!

అతడు బయలుదేరుతుండగా మహారాజా

## కళలు - హస్తకళలు

విభిన్నమైన కళలకూ, సునిశితమైన హస్తకళలకూ ప్రసిద్ధిగాంచింది పశ్చిమ బెంగాల్. ఇక్కడ నేసే చేనేత



వస్త్రాలకు దేశవ్యాప్తంగా మంచి ఆదరణలభిస్తోంది. టాంగైల్, ధనేకళి గ్రామాలు చేనేత వస్త్రాలకూ; ముర్షిదాబాద్ పట్టు వస్త్రాలకూ పేరుగాంచాయి.

బంకూరా,బిష్ణుపూర్‌లు టెర్రకోట బొమ్మలకూ, హస్తకళలకూ చాలా ప్రసిద్ధిగాంచాయి. బిష్ణుపూర్‌లో ప్రాచీనమైన టెర్రకోట ఆలయాలు ఉన్నాయి. గవ్వల బొమ్మలకూ, నగలకూ, టుస్సోర్ పట్టుకూ, బలుచారీ చీరలకూ ఈ పట్టణం పేరొందింది.

శిల్పకారులకు ప్రపంచవ్యాప్తంగా పేరు గాంచిన పట్టణం కుమర్తొలి. దుర్గాపూజ సందర్భంగా రాష్ట్రమంతటా పూజించే అత్యంత శోభాయమానమైన పెద్దపెద్ద విగ్రహాలను ఇక్కడే తయారుచేస్తారు. దేశవ్యాప్తంగానే కాకుండా విదేశాలలో ఉండే బెంగాలీలకు కూడా ఇక్కడి శిల్పకారులే దేవీ విగ్రహాలను తయారుచేసి పంపుతారని చెబుతారు.

పురూలియా జిల్లా పురూలియాఛావ్ అనే యుద్ధకళను స్ఫురింపజేసే నాట్యకళకు ప్రసిద్ధి గాంచింది. ఈ నాట్యం యొక్క ప్రాచుర్యం ఇక్కడ తయారయ్యే ముఖకవచాలకూ, బంకమన్ను నమూనాలకూ మంచి పేరు తీసుకువచ్చాయి.





వారు ఎదురుపడి, "థాకూర్ మహాశయ్! సేవకులు అన్నీవడ్డించారుకదా! తృప్తిగా భోంచేశారు కదా?" అని అడిగాడు ఎంతో ఆప్యాయంగా.

"లేదు ప్రభూ! తృప్తిలేదు. అయినా అందుకు ఎవరిని నిందించీ ప్రయోజనంలేదు. అంతా విధాతరాత!" అంటూ బ్రాహ్మడు జరిగినదంతా ఏకరువుపెట్టాడు.

ఇది విన్న మహారాజావారు కలవరపడ్డాడు. "థాకూర్ మహాశయ్! ఇప్పుడు విందుసమయం దాటిపోయింది. దయచేసి ఈ రాత్రికి ఇక్కడే బస చేయండి. రేపు నేనే తమరికి దగ్గరవుండి స్వయంగా వడ్డిస్తాను. మీరు కడుపునిండా విందారగించవచ్చు!" అన్నారు.

బ్రాహ్మడు అందుకు అంగీకరించాడు.

మరునాడు మళ్ళీ విందు ఏర్పాటయింది. మహారాజావారు పాకశాస్త్ర ప్రవీణుడు కావడంతో, ఆయనేస్వయంగా వంటలు తయారు

## పండుగలూ పబ్బాలూ



బెంగాల్‌లో దసరా పండుగను దుర్గాపూజగా జరుపుకుంటారు. ఇది ఈ ప్రాంతంలో చాలాముఖ్యమైనపండుగ. దుష్టుడైన మహిషాసురుడి మీద దుర్గాదేవి సాధించినఘనవిజయానికిసంకేతంగా దీనిని చాలా ఘనంగా జరుపుకుంటారు. మామూలుగా ఇది అక్టోబర్ - నవంబర్ నెలల మధ్య వస్తుంది.

జనవరిలో వచ్చే మకరసంక్రాంతిని సాగర ద్వీప్‌లో గంగాసాగర్ మేళాగా జరుపుకుంటారు. బెంగాలీలకు ఏప్రిల్‌లో నూతనసంవత్సరం ఆరంభమవుతుంది. ఫ్యాక్టరీలలో, పరిశ్రమలలో జరిపే విశ్వకర్మపూజ సందర్భంగా దేవశిల్పి విశ్వకర్మను పూజిస్తారు. సెప్టెంబర్‌లో వచ్చే ఈ పండుగసందర్భంగా గాలిపటాలు వదలడం ఇక్కడచెప్పుకోతగ్గవిశేషం!

దీపావళిని శ్యామ (కాళీ) పూజగా జరుపుకుంటారు.

చేశారు. అంతా సిద్ధమయ్యాక బ్రాహ్మడు భోజనానికికూర్చున్నాడు. మహారాజావారు దగ్గరేవుండి, బ్రాహ్మడి భోజనానికి ఏమాత్రం ఆంటంకం రాకుండా సర్వ జాగ్రత్తలూ తీసుకున్నారు.

పైనుంచి విరిగిపడడానికికానీ, పక్కలనుంచి ఎగబాకడానికిగానీ, ఏదీ కనిపించక పోయేసరికి బ్రహ్మదేవుడు బ్రాహ్మడివిందుకు ఎలాంటిఆటంకమూ కలిగించలేకపోయాడు. తీవ్రంగా ఆలోచించిన బ్రహ్మ చటుక్కున ఒకచిన్న బంగారు కప్పగా మారి బ్రాహ్మడు భోజనం చేస్తున్న అన్నం మీదికి దూకాడు. అయితే బ్రాహ్మడు విందు భుజించే ఉత్సాహంలో ఉన్నాడు గనక దానిని గమనించలేదు. బంగారు కప్పతోపాటు గుప్పెడు అన్నం తీసుకుని నోట్లోవేసుకుని అలాగే మింగేశాడు. అన్నంతోపాటు బంగారు కప్పకూడా బ్రాహ్మడి కడుపులోకి చేరింది. బ్రాహ్మడు కడుపునిండా తిని, ఒకసారి తృప్తిగా త్రేన్చి, లేచి చేయి కడుక్కుని సుగంధభరితమైన 'మిఠాపాన్' వేసుకొని రాజభవనం నుంచి వెలుపలికివచ్చాడు. భుక్తాయాసం తీరాక, మహారాజావారిచ్చిన కానుకలతో స్వగ్రామానికి బయలుదేరాడు.

అతడు పొలాలగుండా నడుస్తూండగా, "బ్రాహ్మడా! నన్ను వదిలిపెట్టు! దయచేసి నన్ను బయటకు వదులు!" అన్న మాటలు వినిపించాయి. బ్రాహ్మడు ఉలిక్కిపడి చుట్టు పక్కల ఒకసారి కలయజూశాడు. ఎవరూ కనిపించలేదు. కొన్ని అడుగులు ముందుకు వేయగానే, "బ్రాహ్మడా! నన్ను వదలిపెట్టు! నన్ను వదిలిపెట్టు," అనే మాటలు మళ్ళీ వినిపించాయి. "నేను నిన్ను వదలడమేమిటి? అసలు నువ్వెవరు?" అని అడిగాడు బ్రాహ్మడు.

"నేనే విధాతను! బ్రహ్మదేవుణ్ణి!" అనే మాటలు వినిపించాయి.

"ఎక్కడున్నావు?" అని అడిగాడు బ్రాహ్మడు.

"నీ కడుపులో ఉన్నాను. చిన్న బంగారు కప్పగా మారి నువ్వు తింటూన్న అన్నంమీదికి దూకాను. అయినా నువ్వు గమనించకుండా అన్నంతోపాటు అలాగే మింగేశావు. అలా నీ కడుపులోకి చేరాను," అన్నాడు బ్రహ్మదేవుడు.

"ఆహా! అదాసంగతి! ఆటంకం లేకుండా కడుపునిండా ఎలా తినగలిగానా అన్న అనుమానం నా మనసును ఇంకా పీడిస్తూనే ఉన్నది. ఇప్పుడే తెలిసింది అసలు సంగతి. నీకు మంచి శాస్తి జరిగింది. ఇక నన్నేమీ చేయలేవు. నువ్వు ఎక్కడ ఉండాలో అక్కడికే చేరావు. ఇక నిన్ను వదలనుగాక వదలను," అంటూ గొంతును బిగువుగా మూసుకున్నాడు బ్రాహ్మడు.





కూర్చోవున్నాడు. తర
వాత, "మహాలక్ష్మీదేవి ఏం పనిమీద వచ్చారో తెలుసుకోవచ్చా?" అన్నాడు.

"విధాతను నువ్వు నీ కడుపులో చెరబట్టావు. ఆయన లేకుండా మూడు లోకాలలో ఏ పనీ సక్రమంగా సాగడం లేదు. దయచేసి ఆయన్ను వదిలిపెట్టు," అన్నది లక్ష్మి. ఆ మాటలు వినగానే బ్రాహ్మడు కోపంతో మండిపడ్డాడు. "ఆ దుడ్డుకర్ర ఇలా తీసుకురా," అని భార్యను కేకవేసి, "ఈ దేవతకు నేనెవరో తెలియచెబుతాను. ఇంతకాలం జీవితంలో ఏ క్షణానగాని నన్ను కన్నెత్తి చూడని మహాతల్లి, ఇప్పుడేదో కాలం కలిసివస్తే మన ఇంటిని వెతుక్కుంటూ వచ్చి దానిని కాస్తా చెడగొట్టడానికి చూస్తోంది! దుష్టుడైన ఆ విధా తను వదిలిపెట్టమని పెద్ద సలహా ఇస్తోంది! ఎన్నడూ రుచిచూడని నాలుగు దెబ్బలు తగిలిస్తే సరి!" అన్నాడు.

బ్రహ్మదేవుడు ఎంతచెప్పినావదలకూడదన్న దృఢనిశ్చయంతో బ్రాహ్మడు నోరు గట్టిగా మూసుకుని ముందుకు నడవసాడు.

బ్రహ్మ సృష్టికి అంతరాయం కలగడంతో ముల్లోకాలలో అల్లకల్లోలం చెలరేగింది. బ్రహ్మ లేకుండా ఏదీ సవ్యంగా సాగదుకదా! ఏం చేయాలో పాలుపోక దేవతలందరూ ఒకచోట సమావేశమై సమాలోచన జరిపారు. చాలాసేపు చర్చలు జరిగాక సంపదలకూ, అదృష్టానికీ అధిదేవత అయిన లక్ష్మీదేవిని బ్రాహ్మడి దగ్గరికి పంపి బ్రహ్మను విడిపించాలని నిర్ణయించారు.

లక్ష్మీదేవి దేవతల కోరికను కాదనలేక భూలోకానికిదిగివచ్చింది. ఆమెను చూడగానే బ్రాహ్మడు ఆశ్చర్యపోయాడు. ఆ తరవాత లేచి నిలబడి చేతులెత్తి నమస్క రించి ఆమెను

లక్ష్మీదేవి హడలిపోయింది. అంతకుముందెన్నడూ ఎవరూ ఆమెతో అంత పరుషంగా మాట్లాడలేదు. ఆమె ఆ క్షణమే వెనుదిరిగి దేవలోకానికి వెళ్ళి దేవతలకు జరిగింది చెప్పింది.

ఆ తరువాతదేవతలు చదువులతల్లిసరస్వతిని బ్రాహ్మడి దగ్గరికెళ్ళి బ్రహ్మను విడిపించమని వేడుకున్నారు.

సరస్వతిని చూడగానే బ్రాహ్మడు గౌరవంతో లేచి నిలబడి, భక్తిశ్రద్ధలతో చేతులు జోడించి, "నావల్లకాగల కార్యం ఏమిటితల్లీ?" అని అడిగాడు.

సరస్వతి వచ్చినపని చెప్పగానే బ్రాహ్మడు మళ్ళీ ఆగ్రహోద గ్రుడయ్యాడు. దుడ్డుకర్ర తెమ్మని

భార్యను కేకవేసి, "బాల్యంలో ఏదో నాలుగు అక్షరం ముక్కలు నేర్చుకున్నానేతప్ప, ఆ తరవాత ఈ చదువులతల్లి కరుణ నా దరి దాపులకు రాలేదు. ఇన్నాళ్ళూ నా కడుపు కొడుతూవచ్చిన బ్రహ్మ దేవుడు ఇప్పుడేమో తను హాని చేయలేనిచోటికి చేరాడు. నేను ఆయన్ను విడుదలచేయాలట! బావుందివరుస! ఆ దుడ్డుకర్ర ఇటు అందుకో. ఈమెకు సరైన పాఠం నేర్పుతాను!" అన్నాడు.

సరస్వతికూడా భయపడిపోయి అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

ఆఖరికి పరమశివుడే బ్రాహ్మడి దగ్గరికి వచ్చాడు. బ్రాహ్మడు శివభక్తుడు గనక, ఆయన్ను గౌరవంతో ఆహ్వానించి, ఆసనంలో కూర్చోబెట్టి సంప్రదాయబద్ధంగా భక్తిశ్రద్ధలతో పూజించాడు. అంతా అయ్యాక, "ఏమిటి తమ ఆజ్ఞ?" అన్నట్లు చేతులు జోడించుకుని వినయంగా నిలబడ్డాడు.

విధాతను వదిలిపెట్టమని శివుడు ఆదేశించాడు.

"ప్రభూ! నేను మీ ఆనతిని శిరసావహిస్తాను. అయితే, నా సమస్యకు పరిష్కారమేమిటో తమరే సెలవివ్వాలి. నేనూ దుర్భరమైన జీవితం గడిపాను. దాని కంతటికీ మూలకారణం ఈ విధాతే!" అన్నాడు దీనంగా.

"ఇకనీకు ఆ భయం వద్దు. నా భక్తుడివైన నిన్ను నాతో దేవలోకానికి తీసుకు వెళతాను. అక్కడ విధాత తంత్రా లేవీ నీమీద పనిచేయవు," అన్నాడు శివుడు.



ఆ తరవాత బ్రాహ్మడు నోరుపెద్దగా తెరిచి కప్ప రూపంలోవున్న బ్రహ్మ దేవుణ్ణి వెలుపలికి వదిలి పెట్టాడు. ఆ పిమ్మట శివుడు ఇచ్చిన మాట ప్రకారం బ్రాహ్మణ్ణీ, అతని భార్యనూ తనతోపాటు దేవలోకానికి వెంటబెట్టు కుని వెళ్ళాడు.

## పర్యాటక కేంద్రాలు

పశ్చిమ బెంగాల్ రాజధాని కోల్‌కతా చారిత్రక అంశాలు నిండిన ప్రాచీన నగరం. ఇది ఒకప్పుడు బ్రిటిష్ ఇండియాకు రాజధానిగా ఉండేది. నగరంలోని పాత భవనాలలో ఇంకా వలసపాలకుల నిర్మాణ పద్ధతులు కనిపిస్తాయి. విక్టోరియా మెమోరియల్, హౌరా బ్రిడ్జ్, కాళీఘట్, దక్షిణేశ్వర్‌లలోని కాళీమాత ఆలయాలు ఈ నగరంలో ప్రధాన ఆకర్షణలు.

హిమాలయాలలోని డార్జిలింగ్ స్వప్నలోకంలాంటి అద్భుత ప్రాంతం. సిలిగురి నుంచి డార్జిలింగ్‌కు వెళ్ళే 'టాయ్ ట్రెయిన్' పర్యాటకులకు ప్రత్యేక ఆకర్షణ.

శీతల వాతావరణానికీ ప్రకృతి సౌందర్యానికీ డార్జిలింగ్ ప్రసిద్ధిగాంచింది. కాలింపాంగ్, కర్సియాంగ్, టైగర్ హిల్స్ మొదలైనవి ఈ పట్టణం చుట్టుపక్కల వున్న పర్యాటక కేంద్రాలు.

ఇక్కడ టీ తోటలు విస్తారంగా ఉన్నాయి. డార్జిలింగ్ టీ నాణ్యతలో ప్రపంచ ప్రసిద్ధి పొందింది.

గురుదేవుడు రవీంద్రనాథటాగూర్ స్థాపించిన 'శాంతినికేతన్' కలకత్తాకు సమీపంలోనే ఉంది. లలితకళలకూ, కళాప్రదర్శనల అధ్యయనానికీ నిర్దేశించిన విశ్వభారతి విశ్వవిద్యాలయం ఇక్కడే ఉంది. ప్రకృతితో సాన్నిహిత్యం మనిషి అభివృద్ధికి దోహదం చేస్తుందన్న రవీంద్రుల అభిమతం మేరకు–శాంతి నికేతన్‌లో భవనాలలో కాకుండా పెద్ద పెద్ద చెట్ల చల్లని నీడలోనే తరగతులు నిర్వహిస్తున్నారు!

# హాస్యచతురులు



అక్బర్ చక్రవర్తి సింహాస నంలో కూర్చుని, ఒకసారి చుట్టుపక్కల కలయజూ శాడు. ఆయనకు సభాసదు లను ఒక ప్రశ్న అడగాలనిపిం చింది. "ప్రపంచంలోని పుష్పా లన్నిటిలోకీ చాలా ఉత్తమమైన పుష్పం ఏది?" అని అడిగాడు. సభాసదులు ఒకరిముఖాలొకరు చూసుకున్నారు.

సభికులలో ఒకడులేచి అక్బర్ దగ్గరికి వెళ్ళి, తన దగ్గరవున్న చిన్న అత్తరు సీసా మూత తెరిచి అందులోని అత్తరునుంచి ఒక చుక్క అరచేతి వెనక చల్లుకుని ఆయనకు వాసన చూపాడు. "గులాబీ పువ్వు ఉత్తమమైనదనే కదా నీ ఉద్దేశం?" అన్నాడు అక్బర్. అవును అన్నట్టు సంతోషంగా నవ్వాడు సభికుడు.





రాజు బదులేమీ పలకకపోవడంతో మరో సభికుడు లేచి, తన చేతిని పైకెత్తి చూపాడు. అతడు మణికట్టుకు మల్లె పూలదండ చుట్టుకుని ఉన్నాడు. "నిస్సం దేహంగా మల్లెపువ్వే మహాప్రభూ!" అన్నాడు అతడు.

చక్రవర్తికి సంతృప్తి కల్గించినట్టులేదని గ్రహిం చిన మరొక సభికుడు లేచి, ధాపులనున్న స్తంభాలపై చెక్కిన తామరపువ్వుల కుడ్య శిల్పా లను చూపిస్తూ, 'ప్రభూ! స్తంభాలపై తామర పువ్వు శిల్పాలు చెక్కించారుగనక, అవే తమకు అభిమానమైనవేమో!..' అంటూ ఇంకా ఏదో అనబోయాడుగాని, అక్బర్ చేయి పైకెత్తడంతో, ఆ తరువాత మాట్లాడలేక మౌనం వహించాడు.





మరొక సభికుడు రాజు సింహాసనానికి ఇరువైపులా రెండు పూలకుండీలలో అమర్చిన కలువలను గమనించాడు. అతడు లేచి నిలబడి, "పూలకుండీలలో ఉన్నవి నల్లకలువలేకదా ప్రభూ! వాటిని రాజోద్యాన తటాకంనుంచే కదా తెప్పించారు!అవే ఉత్తమమైనవి!" అన్నాడు.



"పువ్వులకు ఆకర్షణీయమైన రంగులు ఉండ వచ్చు; అవి సువాసనలు వెదజల్లవచ్చు; కుండీలలో, స్తంభాలమీద అవి అత్యంత మనోహరంగా కనిపించవచ్చు..అయినా.. అయినా.."అంటూ అక్బర్ చక్రవర్తి అటూ ఇటూ కలయచూసి, "బీర్బల్ఎక్కడ? ఆయన ఎందుకుమౌనంగాఉన్నాడు?"అని అడిగాడు.



"ఇక్కడే ఉన్నాను ప్రభూ!" అంటూ బీర్బల్ తన ఆసనంనుంచి లేచి నిలబడి, "మనం చక్కగా ఉపయోగించుకునేదీ మనకు బాగా ఉపయోగ పడేదే ఉత్తమమైన పుష్పం!" అన్నాడు. చక్రవర్తి ప్రశ్నకన్నా బీర్బల్ సమాధానం క్లిష్టంగా ఉన్నట్లు సభాసదులు గుసగుసలాడసాగారు!



"ప్రభూ! మనం ధరించిన దుస్తులన్నీ ప్రత్తినుంచే తయారుచేయబడ్డాయి. ప్రత్తికి ఆధారం ప్రత్తిపువ్వు. ప్రత్తి పువ్వు లేకుంటే మనం దుస్తులు ధరించే వాళ్ళమేకాదు! అందువల్ల అదే శ్రేష్ఠమైన పువ్వు!" అన్నాడు బీర్బల్. అక్బర్ సింహాసనం నుంచి లేచి, మెట్లుదిగివచ్చి, బీర్బల్‌ను ముత్యాల హారంతో సత్కరించాడు.

# చందమామ కబుర్లు

## పూర్తిగా సొంత వ్యవహారం!

నాలుగు నెలల క్రితం అంతరిక్షయాత్రకు వెళ్ళి వచ్చిన ఒక ఔత్సాహికుణ్ణి ప్రపంచం తిలకించింది. అమెరికాకు చెందిన డెన్నిస్ టిటో అనే కోటీశ్వరుడు ఇద్దరు రష్యన్ వ్యోమగాములతోపాటు అంతరిక్షంలోకి వెళ్ళి ఒక వారం రోజులపాటు ఇంటర్నేషనల్ స్పేస్ స్టేషన్‌లో గడిపి భూమికి తిరిగి వచ్చాడు. ఆయన అంతరిక్ష యాత్ర వివాదాలమధ్య సాగింది. ఇప్పుడు బ్రిటన్‌కు చెందిన అంతరిక్ష అభిమాని స్టీవ్ బెన్నెట్ అంతరిక్షంలోకివెళ్ళిరావడానికి పథకం సిద్ధం చేస్తున్నాడు. అయితే అందుకు ఎలాంటి వివాదాలూ తలెత్తకూడదని బెన్నెట్ భావిస్తున్నాడు.




ఒకప్పుడు టూత్‌పేస్ట్ టెక్నీషియన్‌గా ఉన్న బెన్నెట్–ఇప్పుడు తనకంటూ ప్రత్యేకంగా నోవా అనే ఒక 'వ్యోమనౌక'ను సిద్ధం చేసుకుంటున్నాడు. అది 2001ఆఖరుకిబయలుదేరుతుంది. 100,000 పౌండ్ల రాకెట్ ఆయన్ను 62 మైళ్ళు అంతరిక్షంలోకి తీసుకు వెళుతుంది.

అయినా గంటకు 6,400 కి.మీ. వేగంతో పయనించే 30 అడుగుల పొడవైన ఈ వాహనాన్ని ఆయనే స్వయంగా నడపవలసి వుంటుంది. వ్యోమనౌక తుది మెరుగులు దిద్దుకుంటున్న ఈ సమయంలో బెన్నెట్‌కూడా అంతరిక్ష యాత్రకు తనను సిద్ధం చేసుకుంటున్నాడు!



## సరదాకోసం!

ఏంచేస్తే థ్రిల్లింగ్‌గా ఉంటుందా అని తెగఆలోచించి, ఒక క్రీడాభిమాని ప్యారీస్ నగరంలో ఈఫిల్ టవర్‌పై నుంచి ప్యారాచూట్‌లో కిందికి దూకాలని నిర్ణయించాడు. అనుకున్నప్రకారం కార్యరంగంలోకి ఉరికి, సురక్షితంగా నేలమీదికి దిగాడు. అయితే అతన్ని అదుపులోకి తీసుకోవడానికి పోలీసులు అక్కడ ప్రత్యక్షమయ్యారు. "నేనేం చట్టవిరుద్ధంగా నడుచుకోలేదే? చట్టాన్నిఅతిక్రమించలేదుకదా?" అని వాదించడా క్రీడాభిమాని. చట్టంలో ఏదైనా లొసుగులుంటాయా అని పోలీసులు పరిశీలించారు. ఏదీ కనిపించలేదు. పైగా అంత ఎత్తునుంచి దూకిన మహానుభావుడి ఒంటిమీద ఒక్క గాయంకూడా లేదు. "అయినా, అంతటి దుస్సాహసం ఎందుకు చేశావు?" అని అడిగారు పోలీసులు ఉబలాటం కొద్దీ. "అదా! కేవలం సరదాకోసం!" అన్నాడాయువకుడు నవ్వుతూ.

# ఖరీదైన పాఠం




కుర్చీలో కూర్చోబోతూంటే ఆ వ్యక్తికి తెలియకుండా కుర్చీని వెనక్కు లాగడం ఆకతాయి కుర్రాళ్ళుచేసే అల్లరిపని. అయితే, న్యూయార్క్ లాకాలేజీలో ఈ పనిని సాక్షాత్తు ఒక ఉపన్యాసకుడే చేశాడు. అయితేఆయనగారి ఉద్దేశం అల్లరి చేయడంకాదు. తరగతి గదిలో అతడు తమకు ఇతరులవల్ల నష్టం కలిగినప్పుడు పరిహారం రాబట్టడం ఎలాగా అన్న విషయం బోధిస్తున్నాడు. ఎలా వాదించాలో చెప్పాడు. ఒక్క విషయాన్ని ప్రత్యక్షంగా చేసి చూపాలని ఒకకుర్చీని ఇవతలకు వేగంగా లాగాడు. అయితే అప్పుడే ఒక విద్యార్థిని ఆ కుర్చీలో కూర్చోబోతూ కిందపడి పోయింది. ఆమెకు దెబ్బ తగలడంతో 5,00,000 డాలర్ల నష్టపరిహారం చెల్లించమని ఉపాధ్యాయుడి మీద కోర్టులో కేసు పెట్టింది!

# నశించిపోతున్న భాషలు!

మనం సాధారణంగా నశించిపోతూన్న జంతువులూ, పక్షులూ, చెట్ల గురించి చెప్పుకుంటూ ఉంటాం. ఇలా నశించిపోతూన్న వాటి జాబితాలోకి భాషలు కూడా వస్తాయి. ఇప్పుడు నశించిపోయే ప్రమాదంలో ఉన్న భాష–అమెరికాలోనే అతిపెద్ద రాష్ట్రమైన అలాస్కాలో మాట్లాడే 'ఇయాక్' భాష. మారీ స్మిత్ అనే ఎనభైమూడేళ్ళ వృద్ధురాలు ఆ భాష మాట్లాడుతున్నది. ఆమె మరణిస్తే ఆ భాషకూడా ఆమెతో అంతరించిపోతుంది. ఐక్యరాజ్యసమితి విద్యాసాంస్కృతికసంస్థ యునెస్కో నివేదిక ప్రకారం– ప్రపంచ వ్యాప్తంగా అలాంటి భాషలు 6,800 ఉన్నాయి. ఒక్కొక్క భాషను దాదాపు 2,500 మంది మాట్లాడుతున్నారు. కనీసం లక్షమంది మాట్లాడితేతప్ప, ఏ భాషా బతకదు గనక, మరొక వంద సంవత్సరాలలో వీటిలో తొంభై శాతం భాషలు నశించి పోవచ్చు. ఒక భాష నశిస్తే, దానితోపాటు ఒక సంస్కృతే అంతరించి పోతుందని వరల్డ్ వాచ్ ఇన్స్టిట్యూట్ హెచ్చరిస్తోంది!





# ఉచిత బహుమతి

రంగడికి పదిహేనేళ్ళు. ఏ పనిచేయాలన్నా మహాబద్ధకం. బడికి సెలవులిస్తే చాలు – ఆట పాటలు, తినడం, నిద్రపోవడం మినహా మరొకటి చేయాలని వుండదు వాడికి.

పెరట్లో మొక్కలకు పాదులు తవ్వరా అంటే, భూదేవికి గాయం చెయ్యడం తనవల్ల కాదంటాడు. పోనీ మొక్కలకు నీళ్ళు పోయరా అంటే, వాటికి జలుబు చేస్తుందంటాడు. చెట్టెక్కి కాయలుకోయరా అంటే, చెట్టుమీది పక్షులు తననుచూసి భయపడి పారిపోతున్నాయనీ, వాటిని భయపెట్టడం తనకు ఇష్టముండదనీ అంటాడు.

పోనీ అని ఇంట్లో పనిచేస్తాడా అంటే అదీ లేదు. తలుపులు తుడిచి శుభ్రం చేయమంటే, ''అమ్మా, ఇంటిని నువ్వెంత శుభ్రంగా వుంచుతున్నావంటే, ఏ తలుపు తుడవాలో, ఏ నేల ఊడవాలో నాకసలు తెలియడం లేదు,'' అంటాడు.

బడికి సెలవుకాని రోజుల్లోకూడా పుస్తకం ముందు ఎంతోసేపు కూర్చోడు. అదేమిటని అడిగితే, తను ఏకసంథాగ్రాహినంటాడు. ఎప్పుడూ ఆటలాడడానికి పోతున్నాడని తల్లి వాణ్ణి కోప్పడితే, ''ఆటలు శరీరానికి మంచి వ్యాయామం!'' అంటూ బదులిస్తాడు.

తలిదండ్రులు వాడి తెలివితేటలకు ముచ్చటపడి ఏ పనీ చెప్పేవారు కాదు. అయితే, రంగడు అల్లరిపిల్లవాడు కాదు. గురువులు కూడా వాడి తెలివిని మెచ్చుకునేవారు. ఇలా వుండగా– ఒకరోజు రంగడిమేనమామ శంకరం వాళ్ళింటికి వచ్చాడు. రంగడి తీరు అతడికి నచ్చక, ''అక్కయ్యా, ఇలా వదిలేస్తే, వీడు ఎందుకూ పనికిరాకుండా పోతాడు. వీణ్ణి ఎలాగైనా ఇప్పుడే దారిలో పెట్టాలి!'' అని రంగడి తల్లిని హెచ్చరించాడు.

''వాడు బుద్ధిమంతుడేరా, ఎటొచ్చీ కాస్త పని బద్ధకం, అంతే!'' అని తల్లి రంగడినే వెనకేసుకొచ్చి, ''ఆ పని బద్ధకం నువ్వు పోగొట్టగలవేమో ప్రయత్నించు!'' అన్నది.

సరే, ఆ ప్రయత్నమేదో చేద్దామనుకుని శంకరం, రంగడిని పిలిచి, ''ఒరేయ్, రంగా!

శ్రీరామ కమల్

మన మామిడిచెట్టు విరగకాసింది. ఒక వంద కాయలు కోసి సంతలో అమ్మేమంటే కనీసం నూటయాభై రూపాయలు వస్తాయి. సగం నువ్వూ, సగం నేనూ తీసుకుందాం. నువ్వు చెట్టెక్కి కాయలు కోయి. నేను సంతలో అమ్ముతాను,'' అన్నాడు.

రంగడు నవ్వి, ''సులభంగా జరిగిపోయే దానికి నేను చెట్టెక్కడమెందుకూ, నువ్వు సంతకు వెళ్ళడమెందుకూ, మామయ్యా! ఆ వరాలయ్యను పిలిస్తే, అతడే మనకు ఏ నూటఅరవై రూపాయలో ఇచ్చి, తనే చెట్టు కాయలు దింపించుకుని వెళతాడు,'' అన్నాడు.

శంకరం ఆశ్చర్యపడి, ''నీకు చాలా సంగతులు తెలుసురా! ఇంత తెలివైనవాడివి ఒళ్ళువంచి పనిచేయవేం?'' అన్నాడు.

''మామయ్యా! నేను పని చెయ్యడం లేదనేకదా నాన్న తోటమాలిని పెట్టాడు, అమ్మ పనిమనిషినిపెట్టుకుంది. ఆ విధంగా వాళ్ళిద్దరికీ బ్రతుకుతెరువు ఏర్పడింది.వాళ్ళ పనులు నేనే చేసి వాళ్ళ పొట్టకొట్టడం నాకిష్టం లేదు,'' అన్నాడు రంగడు.

వాడి తెలివితేటలకు అబ్బురపడుతూనే, ''పోనీ నువ్వు పనిచేసి, ఆ డబ్బు వాళ్ళకు దానంగా ఇవ్వవచ్చుగా!'' అన్నాడు శంకరం చిన్నగా నవ్వుతూ.

రంగడు ఏమాత్రం తడబడకుండా, ''సిగ్గు లేనివారే దానాలు తీసుకుంటారు! అభిమానంవున్నవాళ్ళు శ్రమకుతగ్గ ప్రతిఫలం తీసుకుంటారు. మనం అభిమానం వున్న వారినే తప్ప సిగ్గులేని వారినీ, సోమరిపోతులనూ ఎప్పుడూ ప్రోత్సహించకూడదు మామయ్యా!'' అన్నాడు.



తన మేనల్లుడు చాలా తెలివైనవాడనీ, మాటలతో వాడిని గెలవడం కష్టమనీ శంకరానికి అర్థమయింది. అయినా వాడిచేత ఎలాగో అలా పని చేయించాలన్న పట్టుదల పుట్టింది శంకరంలో. అతడా రోజంతా ఊళ్ళో తిరిగి కొన్ని విశేషాలు తెలుసుకుని వచ్చాడు. రాత్రి భోజనాలు చేస్తున్నప్పుడు రంగడి తలిదండ్రులతో, ''రాజయ్య దుకాణంలో కుంచెడు బియ్యం కొన్నవారికి, సోలెడు అటుకులు ఉచితంగా ఇస్తున్నాడు. వీరయ్య బట్టల కొట్టులో రెండు చీరలు కొన్నవారికి, ఒక పంచె ఉచితం. సోమయ్య అంగడిలో రెండు బొమ్మలు కొన్నవారికి, ఒక బొమ్మ ఉచితం – మీ ఊళ్ళో వ్యాపారస్థులు దానాల జోరులో వున్నారే!'' అన్నాడు.ఈ మాటలు విన్న రంగడు, ''తమ సరుకు అమ్ముడుపోవడానికి వ్యాపారస్థులు చూపించే ఆకర్షణ దానం అని



పించుకోదు. వాళ్ళు ఇంతకింతా ఇంకెందులోనో రాబట్టుకుంటారు. అంటే–రాజయ్య దుకాణంలో బియ్యమూ, వీరయ్య కొట్లో చీరలూ, సోమయ్య అంగడిలో బొమ్మలూ మాత్రం చౌకగా వుండి, మిగతా వస్తువులు ఎక్కువ ధరలో వుండవచ్చు! తెలివైనవాళ్ళు వాళ్ళదగ్గర ఉచిత బహుమతులు లభించేవి మాత్రమే కొనుక్కోవాలి.'' అన్నాడు.

''అవున్రా, నువ్వు తెలివైనవాడివి. రేపు ఈ మూడుచోట్లకు వెళ్ళి బియ్యం, చీరలు, బొమ్మలు కొనుక్కుని రావాలి, సరేనా?'' అన్నాడు శంకరం.

రంగడికి ఏమనాలో తెలియలేదు. పని చేయడానికి వాడికిబొత్తిగా ఇష్టముండదు కానీ, శంకరం వాణ్ణి తెలివిగా బోల్తా కొట్టించడంతో సరేనన్నాడు. తెల్లవారింది. అంతా నిద్ర లేచారు కానీ రంగడు నిద్ర లేవలేదు. తల్లి బలవంతాన లేపితే తలనొప్పి, ఒంటినొప్పి, కడుపునొప్పి అన్నాడు. ఆమె కంగారుపడివైద్యుణ్ణిపిలిపించింది. వైద్యుడు వాడికేవో గుళికలిచ్చి వెళ్ళాడు. అయినా రంగడు మాత్రం పడుకుని మూలుగుతూనే వున్నాడు. తల్లి ఎంత బలవంత పెట్టినా వాడు పచ్చి మంచినీళ్ళుకూడా తాగలేదు.

దుకాణాల్లో ఉచిత బహుమతులివ్వడం ఆరోజుతో ఆపేస్తారని తెలియడంతో, శంకరం తనేస్వయంగా బయటకు వెళ్ళాడు. శంకరం అలా వెళ్ళగానే, రంగడు అలా లేచి కూర్చుని, ఆకలేస్తున్నదని తల్లివద్ద మారాం చేశాడు. ఆమెపెట్టింది తిని వెంటనే ఆటలకని బయటికి వెళ్ళాడు.

ఈలోగా శంకరం తనక్కావలసినవి కొని, ఒక కూలివాడిచేత మోయించుకువస్తూ, దారిలో ఆటలాడుతున్న రంగణ్ణి చూశాడు. మేనల్లుడు తనను మరీ ఇంతగా మోసంచేస్తాడని అతడనుకోలేదు. రంగడుకూడా శంకరాన్ని చూశాడు. మేనమామకు కనబడకుండా దాక్కోవాలని పక్కకు నక్కుతూ, చూసుకోకుండా పాకుడునేలమీద కాలుపెట్టి జారి పడ్డాడు. అక్కడ ఏదో రాయి కొట్టుకుని వాడి మోకాలికి పెద్ద దెబ్బ తగిలింది.

శంకరం మేనల్లుణ్ణి సమీపించి చెయ్యందించేలోగా, తనంతటతానే లేవబోయి మళ్ళీ పడిన రంగడికి మోకాలికి కాస్త కింద ఇంకో చిన్న దెబ్బ తగిలింది. అప్పుడు శంకరం వాణ్ణి చెయ్యిపట్టి లాగి నిలబెట్టి, ''ఒంట్లో బాగా లేదని అబద్ధంచెప్పి, నన్ను బయటికి పంపావు, సరే. కానీ ఆ తర్వాత నాకళ్ళముందే ఆటలాడతావా?'' అన్నాడు కోపంగా.

''లేదు, మామయ్యా! నీక్కనబడకూడదనే

దాక్కోబోయి పడ్డాను. నీ మీది గౌరవంతో ఎంత దెబ్బ తగిలించుకున్నానో చూడు!'' అంటూ రంగడు మోకాలిమీద తనకు తగిలిన పెద్ద దెబ్బను చూపాడు. ఆ దెబ్బను చూస్తూనే శంకరానికి గుండె చెరువై, ''అఘోరించావులే! పడ్డవాడివి, నేను చెయ్యి అందించగానే అందుకోవద్దూ? అనవసరంగా మళ్ళీపడి ఇంకో దెబ్బ తగిలించుకున్నావు,'' అన్నాడు జాలి, చిరాకు కలిసిన గొంతుతో.

''అబ్బే, అదేంకాదు, మామయ్యా! ఈ చిన్నదెబ్బ పెద్దదెబ్బ తిన్నందుకు ఉచితంగా వచ్చిన బహుమతి అంతే!'' అన్నాడు రంగడు నవ్వుతూ.

ఈ మాటలు వినగానే శంకరానికి నవ్వాగలేదు. అతడు, ''ఛీ, వెధవా!'' అని రంగడి వీపు తట్టి, ఇంట్లో వారందరికీ జరిగింది చెప్పి, ''మాటల తెలివిలో రంగడు తనకుతనే సాటి. వాడికి లోకజ్ఞానముంది. బాధలోకూడా నవ్వి, నవ్వించగల గుండె నిబ్బరముంది. అందుకే భూదేవి కూడా వాడికి పెద్ద దెబ్బతోపాటు చిన్న దెబ్బను ఉచిత బహుమతిగా ఇచ్చింది!'' అన్నాడు.

అయితే, ఆ రోజునుంచీ రంగడిలో మంచి మార్పువచ్చింది. ఇంట్లో ఎవరేంపని చెప్పినా వెంటనే చేయడమేకాక, అడిగికూడా పనులు చేయసాగాడు. వాడిలోని మార్పుకు కారణమడిగితే, '' ఆరోజు మామయ్యను మోసగించినందుకు, నాకు రెండు దెబ్బలు తగిలాయికదా? అవి నా ప్రవర్తనకు భూదేవి ఇచ్చిన ఉచిత బహుమతులనిపించింది. ఉచితమంటే తగినది అని నాకు తెలుసుకదా! అందుకే, అలాంటి బహుమతులందుకునే ప్రవర్తనను మార్చుకోవాలనుకున్నాను,'' అని చెప్పాడు.

''పని ఎగవేయడంలోకాక, పని చేయడంలోనే తెలివి చూపాలని అనుకునేవారే, అసలు సిసలు తెలివైనవాళ్ళు. ఈరోజునుంచి మా రంగడు అసలైన తెలివిగలవాడు!'' అని రంగడి తలిదండ్రులు ఎంతో సంతోషించారు.



# మనదేశం గురించి తెలుసుకుందాం

## క్విజ్

సుప్రసిద్ధ తత్వవేత్తా, విద్యావేత్తా, రాజనీతి కోవిదుడూ అయిన డా.సర్వేపల్లి రాధాకృష్ణన్ జన్మదినం సెప్టెంబర్ 5. భారతదేశపు రెండవ రాష్ట్రపతి పదవినలంకరించిన ఆ ఆదర్శ ఉపాధ్యాయుడి జన్మదినాన్ని మనం 'ఉపాధ్యాయుల దినం'గా జరుపుకుంటున్నాం. ఈనెల క్విజ్ విద్యారంగానికి సంబంధించినది.

1. ప్రాచీన భారతదేశంలో విద్యాకేంద్రంగా వెలుగొందిన ప్రదేశం ఏది?
2. 'విశ్వభారతి' విశ్వవిద్యాలయాన్ని స్థాపించినవారెవరు? ఎప్పుడుస్థాపించారు?
3. చెన్నయ్ నగరంలో సుప్రసిద్ధమైన నాట్య సంగీత కళావిద్యాలయం ఏది?
4. మన పార్లమెంటు నూతన విద్యావిధానాన్ని ఎప్పుడు ఆమోదించింది?
5. 'ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అడ్వాన్స్‌డ్ స్టడీస్' ఎక్కడ ఉన్నది?
6. కాశీ హిందూవిశ్వవిద్యాలయాన్ని స్థాపించినవారెవరు?
7. మాజీ రాష్ట్రపతి డా.జకీర్‌హుస్సేన్‌తో సంబంధం కలిగిన విశ్వవిద్యాలయం ఏది?
8. మహాత్మాగాంధి ఒక నూతన విద్యావిధానానికి ప్రాచుర్యం కలిగించాడు. దాని పేరేమిటి ?
9. నెహ్రూ తొలి మంత్రిమండలిలో విద్యాశాఖ మంత్రి ఎవరు?
10. కలకత్తా, మద్రాసు, బొంబాయి విశ్వవిద్యాలయాలు ఒకేసంవత్సరం స్థాపించబడ్డాయి.అది ఏ సంవత్సరమో తెలుసా?
11. బోధనా భాషగా ఇంగ్లీషు ఎప్పుడు ప్రవేశపెట్టబడింది.
12. మనదేశానికి చెందిన సుప్రసిద్ధ విద్యావేత్త ఒకరు 'యునెస్కో'డెప్యూటీ డైరెక్టర్ జనరల్‌గా పనిచేశారు. ఆయన ఎవరు?
13. కురుపాండవులకు బాల్యంలో విలువిద్య నేర్పిన గురువు ఎవరు?
14. కేరళరాష్ట్రానికి చెందిన నృత్య రీతులలో శిక్షణనిచ్చే అక్కడి సుప్రసిద్ధ సంస్థపేరేమిటి?
15. ఒక పురాతన విశ్వవిద్యాలయంలో దానికి అనుబంధంగా వైద్యకళాశాలకూడా ఉండేది. అది ఏది?

*(ఈ ప్రశ్నలకు సమాధానాలు వచ్చే సంచికలో)*

### ఆగస్ట్ క్విజ్ సమాధానాలు

1. థర్డ్ నేటివ్ కావల్రీ.
2. ఏ. ఓ. హ్యూమ్ అనే ఆంగ్లేయుడు.
3. డబ్ల్యు.సి. బెనర్జీ; బొంబాయి; 1885.
4. లాలా హర్‌దయాళ్.
5. 1922 ఫిబ్రవరి 5; గోరఖ్‌పూర్ జిల్లా.
6. 1919 ఏప్రిల్ 13.
7. లోకమాన్య బాలగంగాధర తిలక్.
8. 1915.
9. జతిన్ ముఖర్జీ.
10. సర్ తేజ్‌బహదూర్ సప్రూ; ఎం.ఆర్. జయకర్.
11. భగత్‌సింగ్.
12. సింగపూర్‌లో; 1943లో.

[ఆగస్ట్ క్విజ్ 1వ ప్రశ్న భారతదేశంలో ఏ 'ప్రాంతానికి' బదులు 'రెజిమెంటుకు' అని చదువుకోవాలని మనవి.]



# దేవీభాగవత కథలు

బ్రహ్మ ప్రార్థన ప్రకారం, యోగనిద్ర విడిచి వెళ్ళగానే విష్ణువు నిద్రలేచాడని చెబుతున్న సూతుడికి మునులు అడ్డంవచ్చి, "బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సృష్టి స్థితి లయ కారకులనీ, ఆ ముగ్గురిలో విష్ణువు ఉత్తముడనీ విన్నాం. అలాటి విష్ణువును యోగనిద్ర ఆవహించినప్పుడు అతని శక్తీ, తేజస్సూ ఏమయ్యాయి? ఆదిశక్తికి ఇతన్ని మించిన శక్తి ఎలా కలిగింది? విష్ణువే సర్వశక్తిసంపన్నుడని విన్నాం. నువ్వు శక్తి మాత్రమేఅన్ని శక్తులకూ మూలకారణం అంటున్నావు. నిజం ఏదో మాకు తెలియటం లేదు," అన్నారు.

దానికి సూతుడిలా అన్నాడు:

"మునులారా, మీరడిగినదానికి సమాధానం శ్రద్ధగా వినండి. నారదుడు మొదలైన వారు అంతుచిక్కని శక్తి ప్రభావాన్ని అర్థం చేసుకోలేక, విష్ణువే సర్వశక్తిమంతుడని భ్రమపడ్డారు. అలాగే కొందరు శివుడే పరదైవమనీ, మరికొందరు సూర్యుడనీ, మరికొందరు అగ్ని అనీ,ఇంకా కొందరు చంద్రుడనీ, ఇంద్రుడనీ, కొందరు ఏదో అనీ, మాయలోపడి, రకరకాలుగా అభిప్రాయపడతారు. ఎవరు ఏ ప్రమాణాలు చెప్పినా, అన్ని ప్రమాణాలకూ అతీతమైన పరశక్తిమాత్రమే నిజమైన శక్తి. అది విష్ణువులో, శివుడిలో, సూర్యుడిలో, వాయువులో, అగ్నిలో కనబడుతూంటుంది."

అలా శక్తిచేత మేల్కొల్పబడిన విష్ణువు బ్రహ్మనుచూసి, "అబ్బాయీ, నువ్వు తపస్సు కూడా మానేసి ఇలా ఎందుకు వచ్చావు? నీ బాధకు కారణమేమిటి?" అని అడిగాడు.

"ఇంకనేను తపస్సు చేసుకోవటం కూడానా? నీ చెవులనుంచి ఇద్దరు రాక్షసులు, మధుకైటభులనేవాళ్ళు పుట్టి, నన్ను చంపుతామంటూ యుద్ధానికిపిలిచారు," అన్నాడు బ్రహ్మ.

2. మధు కైటభుల వధ – శుకుడి జననం



''దీనికే భయపడతావా? నేను ఎంతలేసి రాక్షసులను చంపానుకాను?''అని విష్ణువు అంటున్నంతలోనే, ఆ రాక్షసులు వచ్చిపడి, బ్రహ్మతో, ''పారిపోయివచ్చి,ఇక్కడ దాక్కు న్నావా? మేం కనుక్కోలేమనే? నిన్ను ఇతను రక్షిస్తాడా? చచ్చేవాడివి నువ్వు ఒంటరిగా చావక, ఇతన్ని తోడు చావమంటావా?'' అని మీదికి వచ్చారు.

విష్ణువు బ్రహ్మను తనవెనక్కు రమ్మని, రాక్షసు లతో, ''తెగ వదరుతున్నారు, మదమెక్కింది కాబోలు? తొందరపడకండి, ఇప్పుడే మీ మద మణుస్తాను,''అంటూ యుద్ధానికి సిద్ధపడ్డాడు.

దేవి ఆకాశంనుంచి చూస్తూండగా విష్ణువూ, మధుడూ యుద్ధం ప్రారంభించారు. సముద్రం పొంగి పొరలసాగింది. మధుడు అలిసిపోవడం చూసి కైటభుడు విష్ణువుతో మల్లయుద్ధం ఆరంభించాడు. రాక్షసులిద్దరూ కలిసి పోట్లాడు తూంటేవిష్ణువుకుక్రమంగా నీరసం వచ్చేసింది. అతనికి ఏం చెయ్యాలో తోచలేదు. రాక్షసు లను ఎలా జయించాలి? దానికి ఉపాయం ఏమిటి? తనకు దిక్కేది? విష్ణువు ఇలా అను కుంటుంటే రాక్షసులు అతనితో, ''యుద్ధం చెయ్యటానికి శక్తి చాలకపోతే, మాకు దాసు ణ్ణని దణ్ణంపెట్టు, లేకపోతే నిన్ను చంపి, తరవాత బ్రహ్మను చంపేస్తాం,''అన్నారు.

విష్ణువు సౌమ్యంగా వారితో, ''అలసిపోయిన వారినీ, వెనక్కుతిరిగినవారినీ, భయపడిన వారినీ,యుద్ధంలో పడిపోయినవారినీ ఎదుర్కో వటం వీరధర్మంకాదు. అది అలా వుంచి, మీరు ఇద్దరున్నారు. నేనేమో ఒక్కణ్ణే! ఒక్క క్షణం విశ్రాంతి తీసుకుని యుద్ధంచేస్తాను. కొంచెం ఓర్చుకోండి. మీకుమాత్రం యుద్ధ ధర్మం తెలియదా?'' అన్నాడు.

''సరే, విశ్రమించు. ఈలోగా మేమూ విశ్రమిస్తాం,'' అన్నారు రాక్షసులు.

అప్పుడు విష్ణువు దివ్యదృష్టితో, ఆ రాక్షసులు వరం పొందినవారని గ్రహించి, ''ఈ దుర్మా ర్గులతో అనవసరంగా యుద్ధం చేస్తినే! వీరు పరాశక్తినుంచి స్వేచ్ఛామరణం వరంగా సంపా దించారు. వీరిని ఎలా చంపటం?'' అని ఆందోళన పడసాగాడు. చివరకు అతను జగదంబను ధ్యానించాడు:

''తల్లీ, నీ సహాయం లేకుండా నేను ఈ రాక్షసులను చంపలేను. మీదుమిక్కిలి వాళ్ళే నన్ను చంపేస్తారు. నువ్వే వీళ్ళకు వరం ఇచ్చి ఉన్నావు. వీళ్ళు చచ్చే ఉపాయం కూడా నువ్వే చెప్పు.''

దీనంగా వేడుకుంటున్న విష్ణువును చూసి దేవి చిరునవ్వు నవ్వి, ''రాక్షసులమీద నా

మాయ కప్పుతాను. వారిని జయించు,'' అన్నది.

రాక్షసులు విష్ణువుతో, '' ఓడిపోతానని ఎందుకు భయపడతావు? శూరులకు జయాప జయాలు రెండూ సంప్రాప్తమవుతాయి. నీచేత ఎందరు రాక్షసులు ఓడారుకారు? అయినా ఎప్పుడూ జయమే కలుగుతుందా?'' అని ఎత్తి పొడిచారు.

ఈ మాటకు విష్ణువు మండిపడి, రాక్షసు లతో తలపడి, వాళ్ళను పిడికిలితో పొడిచాడు. వాళ్ళు నెత్తురు కక్కుతూ విష్ణువును రొమ్ములో పొడిచారు. ఇలా ముష్టియుద్ధం సాగింది. విష్ణువు సొమ్మసిల్లి, రక్తం ఓడుతూ ఉన్న సమయంలో ఆకాశంలో దేవిని చూశాడు.

అదేసమయంలోదేవి రాక్షసులపైన మన్మ థుడిబాణాలలాటిచూపులను ప్రసరించింది. ఆ దెబ్బతో వారు యుద్ధంమాట మరచి మోహ పాశానికి చిక్కుపడ్డారు. ఆ స్థితిలో విష్ణువు ఆ రాక్షసులతో, ''ఎంతమంది రాక్షసులనైనా చూశానుగానీ, యుద్ధవిద్యలో మీతో సమాను లను చూడలేదు. మీ యుద్ధనైపుణ్యం చూసి నాకు చాలాసంతోషమయింది. మీ కోరికఏదన్నా ఉంటేచెప్పండి, తీర్చుతాను,'' అన్నాడు.

దేవీ ప్రభావంచేతమాయామోహితులై ఉన్న రాక్షసులు, విష్ణువు మాటకు అభిమానం తెచ్చు కుని, విష్ణువును తూస్కారంగా చూస్తూ, ''మేం నిన్ను అడిగేవాళ్ళమూ, నువ్వు మాకు ఇచ్చేవాడివీనా? కావాలంటే నువ్వే కోరు, మేం ఇస్తాం!'' అన్నారు.

''నేను కోరినది ఇస్తారా?అదే నిజమైన వీరుల గుణం. చాలా సంతోషం! నా యుద్ధం చూసి మీకు ఆనందం కలిగిన పక్షంలో నాచేత




ఇప్పుడే చచ్చిపొండి,మరి ఇచ్చినమాట నిలు పుకోండి!''అన్నాడు విష్ణువు.

రాక్షసులు కళవళపడి, కొంచెం ఆలో చించి, ''నువ్వు మాటమీద నిలబడేవాడివైతే, మాకు వరం ఇస్తానన్నమాట గుర్తుంచు కుని,నీరులేని విశాల ప్రదేశంలో మమ్మల్ని చంపు. అలా అయితేనే నీ చేతిలో మేం చచ్చి పోతాం,'' అన్నారు.

విష్ణువు నవ్వి, తన తొడలు పెంచి, ''రాక్షసు లారా, రండి,'' అన్నాడు.

రాక్షసులు విష్ణువు తొడలను మించి తమ శరీరాలు పెంచారు. విష్ణువు తన తొడలనూ, రాక్షసులు తమ శరీరాలనూ ఇలా పెంచగా, చిట్టచివరకు రాక్షసుల శరీరాలకన్న విష్ణువు తొడలే పెద్దవి అయ్యాయి. అప్పుడు విష్ణువు తన చక్రాన్ని తలచుకున్నాడు. అది వచ్చి రాక్షసులను నరికేసింది. వాళ్ళ మెదడు,




నీటిలోపడి, పెద్దమిట్ట తయారయింది. అది మొదలు భూమికి 'మేదిని' అనే పేరువచ్చింది.

### వ్యాసుడి తపస్సు

ఇంతవరకు చెప్పినసూతుడితో మునులు, "ప్రసంగవశాన ఇతర విషయాలు చాలా విన్నాం. కాని కొడుకుకోసం తపస్సుచేయ బోయిన వ్యాసుడికథఅలాగేఉండిపోయింది," అన్నారు. మునులతో సూతుడు, వ్యాసుడి తపస్సు గురించి ఇలా చెప్పాడు:

నారదుడు చెప్పిన మంత్రం జపిస్తూ సువర్ణగిరిమీద, కర్ణికారవనంలో వ్యాసుడు తపస్సు ప్రారంభించాడు. ఆయన శక్తిని మన స్సులో నిలిపి తపస్సు చేస్తూంటే, భూమ్యా కాశాలు కంపించాయి. ఇంద్రుడు భయపడి, దేవతలను వెంటబెట్టుకొని శివుడి వద్దకు వెళ్ళి, "వ్యాసుడు తీవ్రమైన తపస్సు చేస్తున్నాడు. గొప్ప ప్రమాదం వచ్చిపడింది. మమ్మల్ని కాపాడు!" అని ప్రార్థించాడు.

"తపస్సుచేసుకునేవారికి కీడు తలపెట్ట రాదు. వాళ్ళు ఇతరులకు చెరుపు చెయ్యరు. వ్యాసుడు కొడుకును కోరి, శక్తితోకూడిన నా కోసం తపస్సు చేస్తున్నాడు," అని శివుడు దేవతలతో చెప్పి, వ్యాసుడి ముందు ప్రత్యక్షమై, అతని కోరిక తీరేలాగు వరమిచ్చాడు. వ్యాసుడు తన ఆశ్రమానికి తిరిగి వచ్చాడు.

అతను అరణిమథించి అగ్నిచేసి, "ఇలాటి అగ్నివంటి కొడుకును నాకు ప్రసాదించగల స్త్రీ ఉన్నదా? అయినా ఆడది పెద్ద ప్రతి బంధకం," అని అనుకుంటుండగా, ఆకా శంలో ఘృతాచి కనబడింది. సమీపంలోనే మన్మథుడుకూడా కనిపించాడు. వ్యాసుడు మన్మథుడి ప్రభావానికి గురి అయికూడా, "ఇది

నన్ను మోసగించటానికేవచ్చి ఉంటుంది, పోనీ దీనితోసుఖంగా ఉంటేవచ్చే నష్టమేమిటి? దీన్ని చేరదీస్తే మునులు నవ్వుతారేమో? లేక, పూర్వం ఊర్వశి పురూరవుణ్ణి చేసినట్టు విరహవేదనలో ముంచేస్తుందా?" అనుకున్నాడు.

పురూరవుడి లాగే తానూ బాధపడవలసి వస్తుం దేమోనని వ్యాసుడు ఘృతాచిని చూసి అనుకున్నాడు. ఘృతాచికూడా వ్యాసుడు తనను ఎక్కడ శపిస్తాడోనని, ఆడ చిలుకగామారి ఎగిరి పోయింది. అయితే వ్యాసుడు అగ్నికోసం మధిం చుతున్న అరణిలో నుంచి శుకుడు పుట్టాడు.

వ్యాసుడు శుకుణ్ణి చూసి, "ఏమిటీ అద్భుతం! ఇది శివుడి మహిమ కావాలి," అనుకున్నాడు. ఆయన తన కొడుకును గంగకు తీసుకుపోయి, స్నానంచేయించి, జాతకర్మచేశాడు. ఆకాశంలో దేవదుందు భులు మోగాయి. భూమిమీద పుష్పవర్షం కురిసింది. నారదుడు మొదలైనవారు పాడారు. రంభ మొదలైన అప్సరసలు ఆడారు.

చిలుకరూపం ధరించిన స్త్రీ కారణంగా పుట్టినందుకు వ్యాసుడి కొడుక్కు శుకుడు అనే పేరువచ్చింది. కుర్రవాడు క్రమంగా పెద్దవాడ య్యాడు. శుకుడికోసం ఆకాశం నుంచి జింక చర్మమూ, దండమూ, కమండలమూ పడ్డాయి.

వ్యాసుడు తన కొడుక్కు ఉపనయనంచేసి, బృహస్పతివద్ద వేదాభ్యాసం చేయించాడు.

శుకుడు తన విద్యాభ్యాసం ముగియగానే గురుదక్షిణ ఇచ్చి, తండ్రివద్దకు తిరిగి వచ్చాడు.

చదువు పూర్తిచేసుకుని తిరిగి వచ్చిన కొడుకును చూసి వ్యాసుడుఎంతో సంతోషించి, అతనికివివాహం చేద్దామనుకున్నాడు. అయితే శుకుడుఅందుకు అంగీకరించక, వైరాగ్యం పూని తత్వం ఉపదేశించమని తండ్రిని వేడుకున్నాడు.

"మనసును అదుపులో పెట్టి నిర్మలంగా ఉంచుకోవటమే ముక్తికి మార్గం. అంతేకాని మరేవీ ముక్తికి బంధాలుకావు. న్యాయంగా ధనం సంపాయిస్తూ, అబద్ధమాడక, శౌచం విడవక, అతిథులను ఆదరిస్తూ, విధ్యుక్తమైన ధర్మాలు చేస్తూ, గృహస్థు ముక్తి పొందుతాడు. అందుకే వసిష్ఠుడు మొదలైనమహర్షులందరూ గృహస్థాశ్రమం స్వీకరించారు; నువ్వుకూడా ఒక కన్యను పెళ్ళాడి, నాకు సంతోషం కలిగించి పితృ దేవలకు తృప్తినివ్వు," అన్నాడు వ్యాసుడు.

ఇంతచెప్పినా శుకుడి బుద్ధి వైరాగ్యంలోనే ఉన్నదని గ్రహించి వ్యాసుడు మళ్ళీ, "నాయనా ఒకప్పుడు నేను ముక్తినివ్వగల దేవీభాగవతం రచించాను. దాన్ని చదివి జ్ఞానివికమ్ము," అని దానిని గురించి చెప్పడం ప్రారంభించాడు.





# పిశాచం చేతిచలవ

చలపతి నగరంలోని కొత్వాలు కచ్చేరీలో చిన్న ఉద్యోగి. అక్కడ పెద్ద మొత్తంలో వుండే ఇంటి అద్దెలు కట్టలేక, నగరానికి కాస్త దూరంగా వున్న, ఒక పల్లెటూరు సమీపంలోని పాతకాలపు పెంకుటిల్లును చవగ్గా కొనుగోలు చేశాడు.

ఆ ఇంట్లో చేరినప్పటి నుంచీ, అతడి భార్య రాజ్యం కష్టాలు రెట్టింపు అయ్యాయి. భర్త చలపతి ఉదయమే బయల్దేరి నగరానికివెళ్ళి, రాత్రి పొద్దుపోయి ఇంటికి తిరిగి వచ్చే వాడు. అప్పటిదాకా అత్త కాంతమ్మ, కోడల్ని రాచి రంపాన పెట్టేది. కట్నం తీసుకురాని రాజ్యం అంటే కాంతమ్మకు అంతులేని కసి. ఆమె కోడల్ని తరుచూ తిడుతూ, రోజుకు ఒకసారైనా చేయిచేసుకునేది.

అత్త ఇంటి నడవాలో కూర్చుని, వచ్చిన అమ్మలక్కలతో కబుర్లాడుతూంటే, రాజ్యం ఇంటెడు పనీ చేసి, ఆదరాబాదరా ఇంత తిని, పెరట్లోని చింతచెట్టుకింద వున్న నులక మంచం మీద కూర్చుని, రాత్రి చీకటి పడి భర్త వచ్చే వరకూ బిక్కుబిక్కుమంటూ కాలంగడిపేది.

ఒకనాటి రాత్రి కాంతమ్మ హాయిగా భోజనం చేసి, రాజ్యంచేత దగ్గిరుండి వంటిల్లు కడిగించి, అంట్లు తోమించి, ''ఇకపోయి చింతచెట్టు కిందున్న నులక మంచంమీద, మీ ఆయన వచ్చేవరకూ మహారాణిలా పవళించు!'' అంటూ పెరట్లోకితోసి, తలుపు మూసుకున్నది.

రాజ్యం నులక మంచం మీద చలికి వణు కుతూ, ఒక పక్కగా కూర్చున్నది. మంచం మధ్యలో తాళ్ళన్నీ తెగిపోవడంతో, మంచం పడుకోవడానికి అనువుగా లేదు. కొంతసేప య్యాక, ఒక ఆడ పిశాచం ఆమె మంచం దగ్గర ప్రత్యక్షమయింది. పెనురక్కసి లాంటి అత్త

మాచిరాజు కామేశ్వరరావు

రోజూ పెట్టే బాధల్ని భరిస్తున్న రాజ్యానికి, ఈ సాదాసీదా పిశాచాన్నిచూసిభయంకలగలేదు.

''నేను పిశాచాన్ని!'' అన్నది పిశాచం కళ్ళు తిప్పుతూ, చేతులాడిస్తూ.

''చెప్పాలా! ఆ సంగతి తెలుస్తూనే వున్నది,'' అన్నది రాజ్యం నిబ్బరంగా.

''నా పేరు శాంతి. నా నివాసం, నీ నులక మంచానికి రాత్రింబవళ్ళు నీడనిచ్చే, ఈ చింత చెట్టు,'' అన్నది పిశాచం.

''అంతా సరే! మనుషులకే భీతి కలిగించే ఇంత చీకటివేళ, నువ్వు చెట్టెందుకు దిగినట్టు?''అని అడిగింది రాజ్యం,త్వరగా పిశాచి తలనొప్పి వదిలించుకుందామని.

''ఆహా, అడగవలసిన ప్రశ్నే అడిగావు,'' అంటూ పిశాచి కిచకిచమంటూ నవ్వి, ''కొన్నేళ్ళుగా ప్రశాంతంగా, ఈ చెట్టు మీద వుంటున్నాను. మీరీ ఇంట్లోకి వచ్చాక, నీ పరమ గయ్యాళి అత్త అరుపులకు, నా చెవులు చిల్లులు పడుతున్నాయి. ఆవిడ పెట్టే కష్టాలు నువ్వు మౌనంగా భరించడందేనికి? తిరగబడు,'' అన్నది పిశాచం.

''ఒసేసే, శాంతీ! తిరగబడడం, బోర్లబడడం,ఏ గృహిణికీ నువ్వు చెప్పినంత తేలిక కాదు. నా భర్తఎంతో మంచివాడు. కట్నం కోరకుండా నన్ను పెళ్ళి చేసుకున్నాడు. తల్లిని గురించి ఆయన దగ్గర మొరబెట్టుకుని మనసు నొప్పించడం, నాకిష్టంలేదు. నీకు శాంతి కావాలనుకుంటే, ఈ చెట్టు వదిలి మరో చెట్టు చూసుకో,'' అన్నది రాజ్యం.

ఆ జవాబుకు పిశాచం గట్టిగా తల కొట్టుకుని, ''నీతో మాట్లాడడం దండగ. నా సమస్య తీరాలంటే నీ గయ్యాళి అత్తను చూడాల్సిందే,''



అంటూ అక్కడ మాయమై కాంతమ్మ మంచం దగ్గర ప్రత్యక్షమై, ఆమె మీదికివేడిగాలి ఊదింది.

''ఈ చలిరోజుల్లో హాయిగా ఇంత వేడిగాలి ఎక్కణ్ణించబ్బా!'' అనుకుంటూ కాంతమ్మ కళ్ళు తెరిచి, ఎదురుగావున్న పిశాచాన్ని చూసి కెవ్వుమన్నది.

పిశాచం నవ్వి, ''భయపడకు, కాంతమ్మా! నేను శాంతిని! నీకు జరిగిన అన్యాయానికి జాలిపడి మేలు చేయకోరి వచ్చాను,'' అన్నది.

పిశాచం మేలు చేస్తాననగానే కాంతమ్మ కాస్త ధైర్యం తెచ్చుకుని, ''ఇంతకూ నాకు జరిగన అన్యాయమేమిటి? నువ్వు చేయబోయే మేలేమిటి? వేగిరం చెప్పు'' అన్నది.

''ఆహా, నీ బోటి ఇంత ఉత్తములూ, వెన్నలాంటి మనసున్న అత్తలూవుండబట్టే, ఏ మహా ప్రళయమో రాకుండా లోకం నడుస్తున్నది!



చూడు, ఎర్రగానీ కట్నం తీసుకురాని కోడలు చేసిన అన్యాయం, ఈ జన్మంతా క్షోభ పెట్టేదే గదా?'' అన్నది పిశాచం.

''ఒట్టి క్షోభా, గుండెకోత! అందుకే దాన్ని రాచి రంపాన పెడుతూ, కాస్తలో కాస్త కడుపు మంట చల్లార్చుకుంటున్నాను, మంచిదాన్ని గనక,'' అన్నది కాంతమ్మ.

''మహాబాగా చెప్పావు, కాంతమ్మా! కోడల్ని ఎంత కొట్టినా, తిట్టినా నీ కొచ్చే ఆదాయం ఏమీ లేదుకదా. నాదగ్గర మూడు అద్భుత వస్తువులున్నాయి. అందులో ఒకటి నీకిస్తాను. ఇక, నీకు డబ్బుకు కరువంటూ వుండదు,'' అన్నది పిశాచం.

ఆ మాట వింటూనేకాంతమ్మ లేచి నిలబడి, ''ఇంకా ఆలస్యమెందుకు! ఆ వస్తువులేవో చూపించు,''అన్నది.

పిశాచం ఒక గులాబీ రంగు తువ్వాలును, చేతిలోకి రప్పించి, ''నీ కోడలు పిల్లకు తల స్నానం చేయించి, ఈ తువ్వాలుతో తల తుడిచి విదిలిస్తే, ఒక్కొక్క నీటిచుక్క మంచి ముత్యంగా మారి, నీ కాళ్ళ ముందు ముత్యాల జల్లు కురుస్తుంది,'' అన్నది.

''ఎంత అమర్యాద! దానికి స్నానం చేయించి తల తుడవడమా?'' అన్నది కాంతమ్మ మూతిముడిచి.

ఈసారి పిశాచం ఒక వెండిరంగు దువ్వెనను తెప్పించి, ''ఈ దువ్వెనతో నీ కోడలి తల దువ్వితే, దువ్వెనలో చిక్కిన ప్రతి కేశం బంగారు తీగెగా మారుతుంది,'' అన్నది.

కాంతమ్మ పెదవి విరిచి, ''నెత్తిమీద నేను పొడిచిన పోట్లకు, దాని జుట్టు ఈపాటికి సగం పైగా రాలేపోయింది. ఇక మిగిలిన జుట్టు మొత్తం బంగారం అయినా, పిడికెడు మాత్రం కూడా చేతికి రాదు,'' అన్నది.

పిశాచం ఈసారి ఒక దుడ్డుకర్రను తెప్పించి, ''కాంతమ్మా, బాగా విను! నువ్వు నీ కోడల్ని ఒక తిట్టుతిడితే, ఈ దుడ్డుకర్ర ఒకదెబ్బ వేస్తుంది. ఆవెంటనేనీ కోడలు చేతిలోకిఒకబంగారుకాసు వస్తుంది. అలాగే, నువ్వు నీ కోడల్ని ఒక దెబ్బ వేస్తే, ఇది నాలుగు దెబ్బలు వేస్తుంది. నీ కోడలు చేతిలోకి నాలుగు బంగారు కాసులు వస్తాయి,'' అన్నది.

కాంతమ్మ కళ్ళింతచేసి, ''చెప్పవేంమరీ!'' అంటూ దుడ్డుకర్రలాక్కుని ''హసైపోయిందిగా, ఇక నీ దారిన నువ్వు పో,'' అంటూ పిశాచాన్ని కసిరింది.

మరుక్షణం పిశాచం మాయమైపోయింది. కాంతమ్మ అప్పటికప్పుడు దుడ్డుకర్ర మహిమ

చూడాలనుకుని, పెరట్లోకి పోయి, నులక మంచంమీదకునికిపాట్లుపడుతున్న రాజ్యాన్ని కుదిపి లేపుతూ, ''కళ్ళు తెరవ్వే నిద్రగొట్టు మొహమా!'' అంటూ పెద్దగా తిట్టింది.

వెంటనే కాంతమ్మ చేతిలోని దుడ్డుకర్ర పైకి లేచి, ఆమె తలమీద గట్టిగా ఒకదెబ్బ కొట్టింది. ఆ దెబ్బకు కళ్ళు బైర్లుకమ్మి కెవ్వుమన్నది, కాంతమ్మ.

''అత్తయ్యా, ఆశ్చర్యం! నా చేతిలోకి ఒక బంగారు కాసు వచ్చింది,'' అంటూ దాన్ని అత్త చేతికిచ్చింది, రాజ్యం.

కాంతమ్మ ఆ కాసును ఆత్రంగా కొంగుకు ముడివేసుకుని, రాజ్యానికి గాలిలో తేలుతున్న దుడ్డుకర్రను చూపుతూ, ''అలా గుడ్లప్పగించి చూస్తావేం మొద్దు మొహమా! ఆ దుడ్డుకర్రను అందుకో,'' అంటూ కోడలి తలమీద గట్టిగా మొట్టింది.

అంతే! దుడ్డుకర్ర కాంతమ్మ తల మీద నాలుగు దెబ్బలు వేసింది. మరొకసారి తన చేతిలోకి వచ్చిన నాలుగు బంగారు కాసులనూ, అత్త చేతిలో పెట్టింది, రాజ్యం. కాంతం వాటిని దూరంగా గిరవాటు వేస్తూ, ''ఇదెక్కడి అద్భుత వస్తువే, పిశాచమా! ఇది నన్ను చావబాదుతున్నదేమిటి,'' అంటూ తలమీది బొప్పెలు తడుముకుంటూ బాధతో గట్టిగా మూలిగింది. ''దుడ్డుకర్ర నీ కోడలిని కొడుతుందని నే చెప్పలేదే!'' అన్నది చింత చెట్టు మీది నుంచి పిశాచం.

''నీ దిక్కుమాలిన అద్భుత వస్తువు, నాకక్కర్లేదు!'' అంటూ కాంతమ్మ దుడ్డుకర్రను గోడ అవతలికి గిరవాటు వేసి, బాధతో పెద్దగా మూలుగుతూ కోడలి చేతుల్లో వాలిపోయింది.

''ఇచ్చిన వస్తువు తిరిగి తీసుకోవడం, ఈ చింతచెట్టు శాంతి ఇంటావంటాలేదు. ఆ దుడ్డుకర్ర శాశ్వతంగా మీ ఇంటివంట ఇంట్లోనే వుంటుంది. కోడల్ని తిట్టడం కొట్టడం – ఏం చేసినా అది చూస్తూ ఊరుకోదు!'' అంటూ పిశాచం చింతచెట్టు దిగువ కొమ్మ మీదికి దిగి పెద్దగా నవ్వసాగింది.

దుడ్డుకర్ర జుమ్ అంటూ గోడ అవతలి నుంచి ఎగిరివచ్చి, కాంతమ్మ వాళ్ళ వంట గదిలో తలుపు పక్కగా ఠకీమంటూ నిలబడిపోయింది. ఆ తర్వాత, ఆ దుడ్డుకర్ర పుణ్యాన కాంతమ్మ, కోడలిని మరెన్నడూ పల్లెత్తుమాట అనలేదు.



25-ఏళ్ళ నాటి చందమామ కథ:

# హాస్యగాడు

పూర్వం ఒక గ్రామంలో ఒక హాస్యగాడు ఉండేవాడు. అతను అందరినీ తన ఛలోక్తులతో నవ్విస్తూ, అందరికీ ఇష్టుడుగా ఉండేవాడు.

ఆ గ్రామంలోనే ఒక మోతుబరి ఉన్నాడు. ఆయన వేటలో ఆరితేరినవాడు. ఒక ఏడు తెగుళ్ళవల్ల ఆయన పంట అంతా దెబ్బతిన్నది. ఆ దిగులుతో ఆయన కొన్నాళ్ళకు మంచం పట్టాడు.

ఈ సంగతి తెలియగానే హాస్యగాడు ఆయనను చూడబోయి, ఆదుర్దాగా, "బాబుగారూ, కొండమీదినుంచి పులి దిగివచ్చి మా ఇంట్లో జొరబడింది. తమరు వచ్చి, దాన్ని కొట్టి, మమ్మల్ని కాపాడాలి," అన్నాడు.

"పంటంతా పాడై దిగులుతో నేను బాధపడుతూ ఉంటే, నన్నిప్పుడు పులిని కొట్టమంటా వేంరా? ఇంకెవరినన్నా పిలువు," అన్నాడు మోతుబరి.

హాస్యగాడు ఆశ్చర్యంగా, "దిగులు పులికన్న కూడా భయంకరమైనదా, బాబుగారూ?" అన్నాడు.

దానితో మోతుబరికి పౌరుషం వచ్చి, మంచంమీదినుంచి లేచి, "ఏదీ తుపాకీ?" అన్నాడు.

హాస్యగాడు ఆయనను వారిస్తూ, "పులి లేదు లెండి. పులిని కొట్టగలవాడు దిగులుకు ఎలా తల వంచాడా అని తెలుసుకోవడానికి అన్నాను!" అన్నాడు.

మోతుబరి నవ్వి, దిగులు మానేసి, మామూలుగా తిరగసాగాడు.



# అజేయుడు గరుడుడు

చిత్రాలు: పాణి

గరుడుడు పడవలో ఉన్నాడనితెలియగానే, దళనాయకులు ఆ పడవను చుట్టుముట్టి, స్పృహ తప్పిన స్థితిలోవున్నగరుడుణ్ణి బంధించి రాజభవనానికి మోసుకువచ్చారు. అయితే, రవీంద్ర దేవుడు ముసుగు తొలగించి చూస్తే అది గరుడుడు కాదనీ, అతని తండ్రి సేనాధిపతి నరేంద్రదేవుడనీ తెలిసింది. గరుడుణ్ణి పట్టుకునే బాధ్యతను రాజు ఆదిత్యుడికి అప్పగించాడు. ఆదిత్యుడి కృషి కారణంగా క్రమంగా రాజ్యంలో అలజడి తగ్గింది. బంజరుభూములు సాగులోకి వచ్చాయి. కొత్త స్థావరాలు ఏర్పడ్డాయి. రాజు సంతోషించి, నరేంద్రదేవుడూ, రవీంద్రదేవుడూ వ్యతిరేకించినప్పటికీ, ఆదిత్యుణ్ణి ప్రధానమంత్రిగా నియమించాడు.

- తరవాత










ప్రధానమంత్రి భవనంలో తన తండ్రి ఆశీస్సుల కోసం ఆదిత్యుడు మౌనంగా ప్రార్థిస్తున్నప్పుడు ఏదో చప్పుడయింది.
''ఆహా, డేగ! తప్పక ఏదో సందేశం తెచ్చి ఉంటుంది!''


అది వీరబాహునుంచి వచ్చింది: ''నూతన స్థావరాలలో అశాంతిని సృష్టించి, ఆ నిందను గరుడుడిపై వేయడానికి రవీంద్రదేవుడు కుట్ర పన్నుతున్నాడు...''


''ఆమెఎలాంటి వార్తతో వస్తున్నదో, ఏమో!''
అతడు ఈ లేఖను చదువుతున్నప్పుడే, అరుణ లోపలికి రావడం గమనించాడు.


''అభినందనలు, ఆదిత్యా!''
''సంతోషం అరుణా! అయినా ఇన్నిరోజులు ఆచూకీ లేదు. ఎక్కడికి వెళ్ళావు?''


''వీరబాహు రక్షణలో నేనొక నూతన స్థావరంలోనే ఉంటున్నాను. అయినా....''
''కుట్రలా?''
''రవీంద్రదేవుడి మనుషులు అక్కడ అరాచకాలను సృష్టిస్తున్నారు. అతడూ, అతడి అనుచరులూ కలిసి ఏవేవో కుట్రలు పన్నుతూ, పథకాలు వేస్తున్నారు!''


''ప్రతిచోటా అలజడులు సృష్టించడం!''
''పథకాలన్నావే? ఎలాంటివి?''
''....ఇరుగుపొరుగురాజ్యాలనుంచి ఆయుధ సామగ్రినీ, మందీ మార్బలాన్నీ తెప్పించడం....''


''రాజునూ, ప్రధానమంత్రినీ తరలించుకుపోయి ఆ నిందను గరుడుడిపై వేసి, అధికార పగ్గాలనుచేజిక్కించుకుని రాజుకు విశ్వాసపాత్రులైన అధికారులను హతమార్చడం!''


'ఆ విషయం గురించి నన్ను ముందే హెచ్చరించి మంచిపనిచేశావ్.
ఇది పౌర్ణమిరేయి. పూజకు వేళయింది.''
'దయచేసి, నువ్వు తగు జాగ్రత్తలో వుండు!''


''మీ తండ్రిగారి మాటలు ఇంకా నా చెవుల్లో గింగురుమంటున్నాయి. నువ్వు చంద్రపురి రక్షణకోసమే జన్మించావు. గరుడభగవానుడు నిన్ను రక్షించుగాక! సెలవు తీసుకుంటాను!''


గరుడ భగవానుణ్ణి పూజించడం ప్రారంభించి ఆరు పున్నములు దాటాయి. ఇది ఏడవ పౌర్ణమి.


"గరుడదేవా! నీ ఆశీర్వాద బలంతో నా తండ్రిగారి స్థానంలో నియమించబడ్డాను. ఈ రాజ్యాన్ని దుష్టులబారినుంచి కాపాడే భారం నీదే..."


ఆదిత్యుడు ప్రార్థనను ముగించేలోపలే ఉన్నట్టుండి ఒక వింత కాంతి గది అంతా అలముకున్నది. అతడు ఒక్కక్షణం ఆశ్చర్యపోయాడు.


"ఆదిత్యా! భయపడకు నీకు ఎలాంటి హానీ జరగదు.
నీ స్వార్థప్రయోజనాలకు అధికారాన్ని దుర్వినియోగం చేయనంతకాలం, నా అదృశ్యశక్తి నీకు కవచంగాఉండి, నిన్ను కాపాడుతుంది. ధైర్యంగా ముందడుగువేసి నీ మాతృభూమిని రక్షించు!"
విగ్రహానికి ముందున్న ఈక నుంచి ఆ వింతకాంతి వెలువడడం ఆదిత్యుడు గమనించాడు.


ఆదిత్యుడు ఆ దివ్యవాక్కులను వింటూన్నప్పుడే – విగ్రహం పాదపీఠంపైనున్న ఈక మెల్లగా లేచి గాలిలో సుడులు తిరుగుతూ క్రమక్రమంగా పెద్దది కాసాగింది. దానిని చూసి అతడు అమితాశ్చర్యం చెందాడు.
ఇంకావుంది

# అతి ముఖ్యకారణం

సత్యవతికి, ఈ మధ్యనే పెళ్ళయింది. పొరుగూరులో వున్న అత్తవారింటికి కొత్తగా కాపరానికి వెళ్ళబోతూ, గ్రామంలోని స్నేహితురాళ్ళను ఒకసారి పలకరించి వద్దామని బయలుదేరింది. ఆమె కొందరు స్నేహితురాళ్ళను చూసినతర్వాత, తనతో బాల్యంనుంచీ కలిసి చదువుకున్న దమయంతి ఇంటికేసి వెళ్ళబోయింది. అయితే, అప్పటివరకూ తను మాట్లాడుతున్న సుగుణ, ఆమెతో, ''దమయంతి ఇంట్లో లేదు, నాలుగైదు రోజుల క్రితం భార్యాభర్తలు ఏదో కీచులాడుకున్నారు. దమయంతి అలిగి పుట్టింటికి వెళ్ళిపోయింది,'' అని చెప్పింది.

ఈ వార్త సత్యవతిని చాలా బాధపెట్టింది. ఆమె తలవంచుకుని ఆలోచిస్తూ ఇల్లు చేరేసరికి, ఆమె తండ్రి వాలుకుర్చీలోపడుకుని ఏదోపుస్తకం చదువుతున్నాడు; తల్లి కత్తిపీటతో పొట్లకాయలు కోస్తున్నది.

సత్యవతి, దమయంతిని గురించి తల్లిదండ్రులకు చెప్పి, తండ్రితో, ''అవును నాన్నా! తెలియకడుగుతానూ, ఇలా భార్యభర్తలమధ్య చీటికీమాటికీ ఎందుకు పోట్లాటలొస్తుంటాయి?'' అని అడిగింది.

సత్యవతి తండ్రి పుస్తకం మూసి తాపీగా, ''తల్లీ! ఇందుకు అతి ముఖ్యకారణం ఏమిటంటే - మనుషుల్లో సహనంపాలు తక్కువా, కోపతాపాలపాలు ఎక్కువా కావడం,'' అన్నాడు.

భర్తమాటలు వింటూనే, సత్యవతి తల్లి అతడికేసి కొరకొరలాడుతూ చూసి, ''అసలు దమయంతి వాళ్ళ ఇంట్లో జరిగిందేమిటో మీకు తెలుసా?'' అంటూ, కత్తిపీటను ఒకవైపుకూ, పొట్లకాయల్ని మరొకవైపుకూ నెట్టి, తక్కున లేచి పక్కగదిలోకి వెళ్ళిపోయింది.

ఇది చూసి సత్యవతి తండ్రి ఏదో చెప్పబోయేంతలో, ఆమె చిన్నగానవ్వి, ''నువ్వేం చెప్పనవసరం లేదు నాన్నా! నాకంతా అర్థమైపోయింది,'' అన్నది.





వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ







ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 20వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.పోటీ ఫలితాలు నవంబర్ 2001 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ఆఫీసర్స్‌కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ -600 097.



## అభినందనలు

జూలై 2001 సంచికలో బహుమతి
పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
ఆర్.వి.రాఘవరావు
సబ్ పోస్ట్ ఆఫీస్
అద్దంకి, ప్రకాశం (జిల్లా) ఆం.ప్ర.
523 201.

బహుమతి పొందిన వ్యాఖ్యలు





మొదటి ఫోటో : పసిపాప అల్లరి!
రెండవ ఫోటో : ఆటలకు పల్లవి!!

చందమామ సంవత్సరచందా:
ఇండియాలో రూ.120లు
Payment in favour of CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

